

జి. వి. చౌదరి: "మన శాసన సభ" అను శీర్షికపై ప్రసంగం (ఇటీవల హైదరాబాద్ కేంద్రమునుండి ప్రసారితం)



డాక్టర్ పి. ఆర్. రాధాకృష్ణయ్య: "భారతదేశం-ప్రణాళికాబద్ధమైన ప్రగతి" అను విషయంపై ప్రసంగం (ఇటీవల హైదరాబాద్ కేంద్రంనుండి ప్రసారితం)

  



రేడియో నాటక సప్తాహ సందర్భమున ప్రసారమైన "మాలతీ మాధవం" నాటికలో పాల్గొన్నవారు (ఇటీవల విజయవాడ కేంద్రంనుండి ప్రసారితం)

వాణి
ప్రతినెలా 7, 22 తేదీలలో వెలువడును.
విడి ప్రతి వెల 35 పైసలు.
సం॥ చందా రూ. 8-40 పై. (పోస్టేజి సహా)
సంవత్సరమునకు తక్కువ చందా
అంగీకరింపబడదు.
ఇతర వివరములకు:
ఎడిటర్: "వాణి"
ఆల్ ఇండియా రేడియో, మద్రాస్-4
ఫోన్ నెం. 71021 ఎక్‌స్టెన్షన్స్ 243 & 245



ALL INDIA RADIO



సంపుటము XIX — వాణి 7—4—1968 — సంచిక 22

# స్వాతంత్ర్య యోధులు : మహాత్మా గాంధీ

బి. ఎస్. ఆర్. కృష్ణ

మనదేశ స్వాతంత్ర్య సంగ్రామ ఉద్యమం మానవకోటి చరిత్రలోనే అపూర్వమైన ఒక అసాధారణ ఘట్టం. మనకంటె రెండువందల సంవత్సరాలకు ముందే జాతీయ స్వాతంత్ర్యం సంపాదించుకొన్న అమెరికావంటిదేశాలు లేకపోలేదు. మన తరువాత యీ ఇరవై యేళ్ళలో అనేక దేశాలు స్వాతంత్ర్యం సంపాదించుకొన్నాయి. అయితే ఆదేశాలు అనుసరించిన పద్ధతులు వేరు. మనదేశం అనుసరించిన పద్ధతి వాటికి పూర్తిగా భిన్నమైనది. మన స్వాతంత్ర్య ఉద్యమానికి లభించిన నాయకత్వంకూడా ఆదేశాలవారికి పూర్తిగా భిన్నమైనది.

నాయకత్వ విశిష్టత

రాజకీయ స్వాతంత్ర్యం ఒక్కటే చాలదని ఆర్థిక, సాంఘిక స్వాతంత్ర్యం కూడా ఉన్నప్పుడే దానికి సార్థక్యం చేకూరుతుందని ప్రపంచంలో హెచ్చుమంది గుర్తించారు. కాని మానసికస్వేచ్ఛకూడా వున్నప్పుడే స్వాతంత్ర్యం అనేది పూర్తి అవుతుందని గుర్తించి, జాతీయ స్వాతంత్ర్య ఉద్యమాన్ని దాని ప్రాతిపదికపై నిర్మించిన మొదటి సందర్భం భారతదేశంలోనే కనపడుతుంది. ఇది గాంధీమహాత్ముని నాయకత్వ విశిష్టత.

భారతదేశానికి స్వాతంత్ర్యం కావాలన్న కోరిక ఆయనకంటె ముందునుంచే వున్నమాట నిజమే. కాని ప్రభుత్వానికి మహజరులు సమర్పించుకొనటం, పత్రికలలో కోర్కెలను ప్రకటించుకొనటం వరకే అప్పటివరకు భారత స్వాతంత్ర్య ఉద్యమం పరిమితమై వుండేది. చిరకాలం పరాధీన, పరాజయతత్వాలకు లోనై, నిర్జీవాత్మతో



నిండిపోయిన జాతిని మేల్కొల్పటానికి, ఆ రకం ఉద్యమం ఏ విధంగానూ సరిపోలేదు. దేశీయులకుకూడ మరింత పెద్ద ఉద్యోగాలు కావాలని కోరటమే స్వాతంత్ర్య పోరాటంగా వుంటున్న కాలంలో గాంధీమహాత్ముడు భారత రాజకీయరంగంలో ప్రవేశించారు. ఆయన ప్రవేశంతో మన స్వాతంత్ర్య ఉద్యమ స్వరూపమే మారిపోయింది. ఇంత పెద్ద దేశాన్ని ఎంతో దూరాన వున్న అంత చిన్నదేశం ఎలా పాలించగల్గుతున్నది? అంత బలమైన దేశాన్ని, ఇంత బలహీనమైనదేశం ఎదిరించి నెగ్గటం ఎలా? గాంధీమహాత్ముడు తేరిపారచూచాడు. కనుచూపుమేరలో ఎటుచూచినా భారతీయులే, భారతదేశమే. ఎక్కడో బస్తీలలో తప్ప ఇంగ్లీషువారెక్కడా కానరారే. మరి బ్రిటిషువారి పాలనకు ఈ దేశప్రజలను బంధితులుగా చేస్తున్నదేమిటి? 'భయం' అనే ఒక్క బలహీనత జాతి బానిసత్వానికి ముఖ్యకారణమని ఆయన గ్రహించాడు. దొరలంటే

## ఈ సంచికలో

ముఖచిత్రం: శ్రీశైల దేవాలయము

["నాడు-నేడు: శ్రీశైలం" అను శీర్షికపై ప్రసంగాన్ని హైదరాబాద్ కేంద్రంనుండి ఏప్రిల్ 24-వ తేదీన మధ్యాహ్నం 1 గంటకు వినవచ్చును]

చదువుకున్నవారికి భయం, భాగ్యవంతులకు భయం. వీరంటే అమాయుక, పేదప్రజలకు భయం ఈ భయంవల్లనే ఇష్టమున్నా లేకున్నా అందరూ ప్రభుత్వంతో సహకరిస్తుండేవారు తమ స్వప్రయోజనాలు ఎక్కడ దెబ్బతింటాయోనన్న భయంతో కొందరు, పరాయి ప్రభుత్వం తనకు తాబేదారులుగా ఉంచుకొనటానికి కట్టబెట్టిన ప్రత్యేక గౌరవాలు, అర్హతలకోసం కొందరు—ఇలా మొత్తంమీద అందరూ యేదో ఒక భయంతో సహకరించటం వల్లనే యీ దేశాన్ని, ఆ దేశం పాలించగలుగుతుంది.

### పాత దృక్పథాలు

కనుక, మొట్టమొదట ప్రజలందరిని ఆవరించివున్న యీ భయాన్ని పోగొట్టాలి. ప్రజలు పరాయి ప్రభుత్వంతో సహకరించకుండా చేయాలి. ఇవి రెండూ జరిగిననాడు జాతికి స్వాతంత్ర్యం లభించి తీరుతుందని ఆయనకు తెలుసు. కొద్దిమంది చదువుకున్నవారు మాత్రమే కాకుండా, యావన్మంది ప్రజానీకం స్వాతంత్ర్య ఉద్యమంలో పాల్గొనాలి.

ఆయన ఇందుకు పూనుకున్నాడు. ప్రజలలో జీవిత ఆడంబరాలను గురించివున్న పాతదృక్పథాన్ని ఆయన మార్చి వేశాడు. పరప్రభుత్వం బిరుదాలు బానిసత్వ చిహ్నాలన్న భావం వ్యాపింపచేశాడు. సంపన్నులు తమ సంపదల ఆడంబరాన్ని ప్రదర్శించుకొనే పాతఅలవాటును మార్చివేశాడు. ఇంతమంది ప్రజలు పేదరికంతో, దారిద్ర్యంతో క్రుంగుతుంటే వారిమధ్య సంపదలతో తులతూగుతూ కూర్చోనటం సిగ్గుచేటు అన్న భావాన్ని వ్యాపింపచేశాడు.

### గాంధేయ సంప్రదాయం

అప్పటివరకు యీ దేశంలో నాయకులుగా వున్నవారు అనుసరిస్తూవచ్చిన పద్ధతులు వేరు. వారికి యీ గాంధేయపద్ధతులు మొదట ఎబ్బెట్టుగా కనుపించాయి అయినా వారిలో హెచ్చుమంది అనతికాలంలోనేగాంధీప్రభావానికి లోనై తమ పాత అలవాట్లను దృక్పథాన్ని మార్చుకొన్నారు. నిరాడంబరత్వం, నిర్భీకత్వం, సహాయనిరాకరణ మహాత్ముని నినాదాలు. సత్యం, అహింస ఆయన చేకూర్చిన ఆయుధాలు. ఇదొక నూతన తరహా విప్లవం. మానవకోటి చరిత్రలో ఇదొక అధునిక నూతన విధానం. ఇదే గాంధేయ సంప్రదాయం.

### మహాత్ముని ప్రబోధం

తనను తాను జయించుకొన్నవారిని అన్యులెన్నటికి జయించజాలరు. విజయం కనుచూపుమేరలో ఉన్నదనుకొనేవారిదే విజయం. ఇది గాంధీ మహాత్ముని ప్రబోధం, విశ్వాసం. ఆయన అనుచరులేకాక ప్రజానీకంకూడ యీ ప్రబోధాన్ని అంగీకరించింది కొద్దిమంది మేధావులు మాత్రమే అంగీకరించలేదు

ఆరోజులలో మహాత్మునికి ఉపయోగపడని నాయకుడంటూ ఎవరూ లేదనే చెప్పవచ్చు. వారి విధానాలు తనకు నచ్చని సందర్భాలలోను, తన విధానాలు వారికి నచ్చని సందర్భాలలో కూడ ఆయన ఇతరులను అర్థంచేసుకొనటానికి ప్రయత్నించేవాడు. బాల గంగాధరతిలక్ అటువంటివారిలో ఒకరు. ఆనాడు దేశంలో ఆయనకు గొప్పపలుకుబడి ఉండేది. మహాత్మునికి ఆయన పద్ధతులు నచ్చలేదు. అయినా ఆయనను ఈయన గౌరవభావంతోచూచారు.

టాగోర్-గాంధీ దృక్పథాలలో ఎంతో వ్యత్యాసం వుంది. జీవితంపట్ల మహాత్ముని దృక్పథం టాగోర్‌కు నచ్చలేదు. అయినా ఆయన గొప్ప ప్రజానాయకుడని టాగోర్ గుర్తించి గౌరవించాడు. అలానే టాగోర్ దేశానికి గొప్పకీర్తి తెచ్చిన కవీంద్రుడని మహాత్మునికి తెలుసు. ఒకసారి ఒక ఊళ్లో టాగోర్ ఒక నాటకంలో వేషం వేయటం మహాత్ముడు చూచాడు. అది ఆయనకు నచ్చలేదు. ఈ మహాదేశపు ఆస్థానకవి యీస్థాయికి దిగజారిపోవటమా, అని మహాత్ముడు బాధపడ్డాడు తరువాత ఇలా ఎందుకు చేశారని ఆయన నడిగారు. శాంతినికేతన్‌కి నిధులు సేకరించటానికి ఇంతకంటె మార్గంలేదని ఆయన చెప్పారు ఎంత నిధికావాలని మహాత్ముడు అడిగాడు. ఫలానా ఇంత కావాలి అన్నాడు టాగోర్. మహాత్ముడు నవ్వి ఇంతేకదా, అన్నాడు. ఆ తరువాత కొద్దిరోజులకే టాగోర్‌కి మొత్తానికి ఒక చెక్కువచ్చింది. దానితో వ్రాసిన ఉత్తరంలో మహాత్ముడు 'మీకు సహాయపడటం దేశానికి గౌరవకారణం' అని వ్రాశారు.

అరవిందునిది మరొక ఉదాహరణ. వీరిద్దరి మధ్యకూడ ఏకాభిప్రాయంలేదు. అయినా యిద్దరికి ఒకరిపట్ల ఒకరికి గొప్ప గౌరవం ఉండేది.

### గొప్ప ప్రజానాయకుడు

మోతీలాల్ నెహ్రూతో మహాత్ముని సంబంధం మరింత కుతూహలకరంగా ఉంటుంది. మొదట గాంధీమహాత్ముని పద్ధతులు మోతీలాల్‌కు నవ్వుపుట్టించేలా ఉండేవి కాని అనతికాలంలోనే ఆయనలో మార్పు వచ్చింది. గాంధీమార్గాన్ని పూర్తిగా అవలంబించాడు పాశ్చాత్యదృక్పథంతో పెరిగి, గాంధేయ ప్రభావానికిలోనైన మరొకగొప్ప వ్యక్తి జవాహర్‌లాల్ నెహ్రూ. ఇంకా ఎందరో నాయకులు మహాత్ముని ప్రభావానికి లోనైనారు. ఆయన మాటకు భారత రాజకీయ రంగంలో ఎదురులేకుండా ఆయన శకం గడిచింది.

కాగా, పూర్వకాంగ్రెసు నాయకులలో ఒక్క మహమ్మద్ అలీ

(తరువాయి 42-వ పేజీలో)



విశాఖపట్నంలోని "మేఖల" భారత నౌకాశిక్షణ కేంద్రము (నౌకాదళ దినోత్సవ సందర్భమున విజయవాడ కేంద్రమునుండి ఇటీవల రూపక కార్యక్రమము ప్రసారమైనది)

# నోచని నోము

"ఆరవి"

బానమ్మగారు ఆ యింటికి పెద్ద, ఆ ఇంటికే కాదు. ఆ ఊరికే పెద్ద అని చెప్పుకోవాలి. ఆమె ఆ ఇంటికి చిన్నతనంలోనే కాపురానికి వచ్చింది. ఆమె కాలు పెట్టినప్పటినుండి, ఆ ఇల్లు సిరిసంపదలతో కలకల్లాడుతూనే ఉంది. ఆ ఊరిలో ఆమె చేతి అన్నం తిననివాళ్లులేరు. కలవాళ్లు ఏ పండగకో, ఏ శుభకార్యానికో వచ్చి వాళ్ల ఇంట్లో భోజనం చేసి ఉండాలి. ఇక బీదవాళ్ల మాట చెప్పనక్కర్లేదు. ప్రతి పండగకు, కొద్దోగొప్పో తిని వెళ్లవలసిందే. బానమ్మగారు పెట్టిన భోజనం ఎంత రుచిగా ఉంటుందో, ఆమె మాటకూడా అంతమధురంగానూ ఉంటుంది.

బానమ్మగారు దీవించినదంటే ఆ దీవన జరిగి తీరవలసిందే. ఎందుకు కాదు? బ్రహ్మముహూర్త కాలానికే లేచి, కాలకృత్యాలు తీర్చుకుని, రెండు గంటలు ఏకాగ్రంగా జపం చెయ్యందే బానమ్మగారు బయటకు రాదయిరి. ఏడెనిమిది గంటల నుండి పది గంటలవరకు, ఆమె ఇంటిముందు జనం పడిగాపులు పడి కూర్చుని ఉంటారు. ఒకామె వాళ్ల పాపకు కోరింత దగ్గుకు విభూతి తీసుకువెడుతుంది. ఒకరొకతను బెణుకు మంత్రం వేయించుకు వెడతాడు. ఇంకొకతను పిల్లవాడు పీడపట్టి ఏడుస్తున్నాడని, మంత్రించిన తాడు పట్టుకువెడతాడు. తలొకళ్లకు తలో బాధ. అన్ని బాధలకు బానమ్మగారు, మంత్రించిన విభూదో, మంత్రించిన జలమో, అందరకు ఇచ్చి పంపుతుంది. అందరూ, ఆ తల్లిచేతి చలువ వలన సుఖించే వాళ్ళే. వేసంకాలం వచ్చిందంటే ఇక చెప్పనక్కరలేదు. అది పాటి ఊరేమో, తేలుకుట్టి బాధపడేవాళ్ళ సంఖ్యకు మేరలేదు. వేళకాని వేళ కూడావచ్చి బానమ్మగారిచేత మంత్రం వేయించుకుని, బాధపడుతూ వచ్చినవాళ్ళు, నవ్వుతూ వెడతారు. బానమ్మగారి మంత్రప్రభావం అటువంటిది, బానమ్మగారి వాక్శుద్ధి కూడా అటువంటిదే. ఆ ఊరికొచ్చిన నూతన దంపతులు, మంచిరోజున వచ్చి, బానమ్మగారికి నమస్కారం చేసి, దీవనలు పొంది, ప్రసాదం సేవించి వెడతారు. వాళ్ల కాపరం సుఖంగా సాగుతుంది. గర్భవతి అయిన ప్రతి ఆడపడుచూ, ఏడో నెలనో, తొమ్మిదో నెలనో బానమ్మగారి దర్శనం చేసుకుని విభూతి తీసుకుని వెడుతుంది. ఆమె సుఖంగా ప్రసవించవలసిందే. ఆ ఊరిలో చాలామందికి బానమ్మగారి దీవనే రక్ష.

బానమ్మగారి పెద్ద కుమార్తె వియ్యమ్మకు మాత్రం యీ మధ్య ఆమె దీవనలు ఫలించినట్టు కనపడదు. వియ్యమ్మ అంటే బానమ్మగారికి పంచప్రాణాలు. తల్లి అంటే వియ్యమ్మకు ఎంత ప్రేమో తల్లిమాటన్నా వియ్యమ్మకు అంత గురి. బానమ్మగారు, కూతురు దగ్గరలో ఉంటుందని, కోరికోరి మేనరికం చేసుకుంది. అల్లుడుకూడా ఎంతో మంచివాడు. భుక్తికి లోటులేకుండా ఇల్లూ వాకిలి కలవాడు, బాగా చదువుకున్నవాడు. మంచి ఉద్యోగస్తుడు. నిగర్వి. అత్తగారి మాటమీద అమిత గౌరవం కలవాడు. వియ్యమ్మను పువ్వుల్లో పెట్టి చూసుకుంటున్నాడు. కాని యీ మధ్య అతనిలో కూడా ఏదో అసంతృప్తి చికాకు కనిపిస్తున్నది. వియ్యమ్మకు నిండా 30 ఏండ్లు లేవు. సంరక్షణ ఎంత బాగున్నా ముసలి రూపు పడింది. ఎంతో ఉత్సాహవంతురాలు సౌజన్యవతి మూలాన్ని ఆమె కళ్లల్లోనూ, ముఖంలోనూ ఉండే కాంతి మాత్రం తగ్గలేదు. ఏం చేస్తుంది పాపం? మొన్నటి కాన్పుతో ఏడుగురు పిల్లలు. బానమ్మగారి ఆశీర్వచన ప్రభావం అనండి. వియ్యమ్మ కడుపుచలవ అనండి. పుట్టిన ఏడుగురు పిల్లలు క్షేమంగా ఉన్నారు, ముగ్గురు మగపిల్లలు, నలుగురు ఆడపిల్లలు. మొదటి కాన్పు ఆడపిల్ల. ఆడపిల్ల పుట్టింది, ఇంట్లో లక్ష్మీదేవి వెలిసిందని ఎంతో ముచ్చటపడ్డారు. తరువాత కుమారుడు కలిగినందుకు, వంశోద్ధారకుడు పుట్టాడని, సంబరపడ్డారు. ఆ పిల్లలిద్దరూ ఎంతో ఆరోగ్యంగా ఉన్నారు. మూడవది మళ్ళీ ఆడపిల్ల. నాలుగు, ఐదుకూడా ఆడపిల్లలే. ఆరు, ఏడు మాత్రం మగపిల్లలు. పుట్టినవాళ్లు క్షేమంగా ఉంటే సరా, ఆరోగ్యంగా కూడా ఉండాలి. రెండో అమ్మాయికి లివరు జబ్బు. మూడోదానికి ఉబ్బసం. రెండోవాడికి నరాల నిస్సత్తువ. వీళ్ళకు బారీతో వియ్యమ్మ సతమతమవుతోంది. బానమ్మగారు మాత్రం ఏంచేస్తుంది, అన్ని పురుళ్లూ తనే పోసింది. తనకు వీలున్నంత మటుకు మనవరాళ్లకు, మనుమలకు సంరక్షణ చేస్తూంది. వైద్యలోపంకూడా లేదు. వియ్యమ్మ అదృష్టం అటువంటిది, ఏదో పెట్టిపుట్టింది. భగవంతుడు కనికరించి సంతానాన్ని ఇస్తూ ఉంటే ఎవరేం చెయ్యగలరు? ఆ భగవంతుడే కనికరించి, వియ్యమ్మను, పిల్లలను క్షేమంగా, ఆరోగ్యంగా ఉండేటట్లు చూడాలిగాని, ఎవరేం చెయ్యగలరు?

ఈ మధ్య సంతానం పుట్టకుండా చేసుకోడానికి అవకాశాలు ఉన్నాయని, వియ్యమ్మకు, బానమ్మగారికి తెలియకపోలేదు. ఆ విషయం బానమ్మగారి దర్బారులో చాలాసార్లు చర్చకు వచ్చింది. బానమ్మగారి దర్బారులో సూరమ్మగారి మాటకు చలామణి ఎక్కువ. సూరమ్మగారు, ఆ వీధి చివర ఎత్తు అరుగుల ఇంటిలోకి ఐదేళ్ళక్రితం కాపురానికి వచ్చింది, సంప్రదాయమైన కుటుంబం. ఆ ఊరు వచ్చినప్పటినుండి, సూరమ్మగారు బానమ్మగారు కుడిభుజంగా ఉంది.

"సంతానం కలుగడం, కలుగకపోవడం వీళ్ళచేతిలో ఉన్నట్టు చెబుతారేమిటి? ఏది, సంతానం లేనివాళ్ళకు ఒక్క నలుసును పుట్టించమను చూద్దాం?" అని సూరమ్మగారు అనేకసార్లు చేసిన సవాలుకు ఆ దర్బారులో ఒక్కరూ సమాధానం చెప్పలేకపోయేవాళ్లు.

"సంతానం లేనివాళ్ళమాటకాదు, నా మాట చెప్పు. నాకు పిల్లలు చాలు, నన్నేం చెయ్యమంటావు సూరమ్మ పిన్నీ?" అని ఇన్నాళ్లూ నిశ్శబ్దంగా యీ వాదన వింటూన్న వియ్యమ్మ ధైర్యంచేసి అడిగింది.

"ఏదైనా భగవంతుడు చెయ్యాలి గాని, మనచేతిలో ఏముంది?" అని పెదిమ విరిచింది సూరమ్మగారు. బానమ్మగారికి భగవంతునిమీద విశ్వాసం లేకపోలేదు. ఐనా అన్నదికదా,

"ఆ మాట నిజమే అనుకో, మా వియ్యమ్మకు నాల్గో కాన్పు వచ్చినప్పుడు "చాలు చాలు, చంటమ్మా" అని పేరు పెట్టుకున్నాం. అయినా కాన్పు రావడం మానలేదు. ఐదవ కాన్పు వచ్చినప్పుడు "వద్దు వద్దు వరలక్ష్మీ" అని పేరు పెట్టుకున్నామా మరి?" బానమ్మగారి ప్రశ్నకు సూరమ్మగారు సమాధానం చెప్పలేక..

"నువ్వుకూడా అలా అంటే ఎలా చెప్పు బానమ్మక్కా? భగవంతుడి అనుగ్రహం కలగాలి. భగవంతుడి అనుగ్రహంవల్లనే సంతానం కలుగుతోందని అనుకోరాదు. మా అమ్మకు పధ్నాలుగురు సంతానం. అయినా మా అమ్మ జిగురున చీది ఎరుగదు. ఆ రోజులే వేరు, ఆ తరహా



ఎమ్. ఎవ్. సహాశీపం: గాత్రం
(మద్రాస్. ఏప్రిల్ 20)




వేరు. వాళ్ళెప్పుడేనా, సంతానం వద్దని అనుకున్నారా?"

"ఆ రోజుల్లో ఆహార సామగ్రి సమృద్ధిగా ఉండేది. ఇంతమంది జనాభా ఎక్కడ? ఏ ఊరివాళ్ళు ఆ ఊళ్ళో ఉండి హాయిగా రోజులు వెళ్లబుచ్చేవారు" అని బుచ్చమ్మగారు ఊతపదం పలికింది బుచ్చమ్మగారు, బానమ్మగారి దర్బారులో మరో ముఖ్యమైన సభ్యురాలు అంతటితో ఆగక "సంతానం చాలు చాలు అనుకుంటారుగాని, పుట్టినవాళ్లలో ఎవడు ఘటికుడవుతాడో, ఎవనివలన ఆ సంసారం గట్టెక్కుతుందో ఎవరు చెప్పగలరు?" అని మరో బలమైన వాదాన్ని బుచ్చమ్మగారు ప్రవేశపెట్టింది.

"ఒకడు పుట్టినా, అతను ఘటికుడు కావచ్చు, ఎంతోమంది పుడితే, అందులో ఏ ఒకడో ఘటికుడవుతాడని ఎక్కడ ఉన్నది? గాంధారికి నూరుగురు సంతానం ఒక్కడూ సన్మార్గుడు కాలేదు, భూమికి భారమయారుగాని" అన్నది రాజ్యలక్ష్మి.

"నీకేం? నువ్వు అదృష్టవంతురాలవు. ఎన్నైనా కబుర్లు చెబుతావు పొన్నెమ్మలాగ" అని నవ్వి ఊరుకుంది సూరమ్మగారు. సమాధానం చెప్పడానికి తోచక. రాజ్యలక్ష్మి బానమ్మగారి కోడలు, వివేకవంతురాలు. విద్యావతి. అయిన ఇంటివారి ఆడపడుచు. ఎదుటివాళ్ల మనస్సు తెలుసుకు మసలే మతిమంతురాలు, ఎవరినీ నొప్పించదు. తానూ నొవ్వదు. అందరి మెప్పు పొందుతుంది బానమ్మగారికి కూతురు వియ్యమ్మ అంటే ఎంత ప్రేమో, కోడలు రాజ్యలక్ష్మి అన్నా అంత ప్రేమ. రాజ్యలక్ష్మికి అత్తగారంటే ఎంతో గౌరవం. కొడుకు కోడలు, అన్యోన్యంగా ఇంటిలో మసలుతోంటే బానమ్మగారు ఎంతో ఆనందపడుతూ, కొడుక్కూ కోడలుకు దృష్టి దోషం తగలకుండా, రోజూ విభూతి పెట్టి దీవిస్తూ ఉంటుంది. వాళ్లే తన ఇంటికి దీపాలని భావిస్తూ ఉంటుంది. రాజ్యలక్ష్మికి ఇద్దరేపిల్లలు. ఒక ఆడపిల్ల, ఒక మగపిల్లవాడు. తరువాత ఆమెకు సంతానం కలుగలేదు. ఇద్దరు పిల్లలూ మెరికల్లా, కలకల్లాడుతూ ఇంట్లో తిరుగుతూ ఉంటారు. బానమ్మగారు మనుమరాలిని మనుమణ్ణి చూసి మురిసిపోతూ ఉంటుంది.

"మీ కోడలు అదృష్టవంతురాలు, ఈ సమస్యలు ఏమీ లేకుండా రాజ్యలక్ష్మి రాణీలా ఉన్నది" అంది బుచ్చమ్మగారు.

"మా రాజ్యానికి మళ్ళీ పిల్లలు పుట్టలేదు, అంతే నోము చేసుకున్నదేమో నని కించపడేదాన్ని. మా వియ్యమ్మ అవస్థ చూసాక. మా రాజ్యం నోచుకున్న నోమే మంచిదనిపిస్తోంది" అని అన్నది బానమ్మగారు ఆతరువాత పిచ్చాపాటి చెప్పుకుని ఎవరింటికి వారంతా వెళ్ళిపోయారు.

దర్బారును చి సరాసరి రాజ్యలక్ష్మి తన గ లోకి వెళ్లింది. గదిలో కూర్చుని దర్బారు కబుర్లు వింటూన్న వాళ్లాయన, నవ్వు ఆపుకోలేక పరుపు మంచంమీద పడి దొర్లుతున్నాడు. అతనెందుకు నవ్వుతున్నాడో రాజ్యలక్ష్మికి తెలుసు.

"అంతగా నవ్వకండి. నవ్వు నాలుగువిధాల చేటు" అంటూ మందలిస్తూ, తాను నవ్వు అపుకుంటూ కొంటెగా చూసింది.

. "పాపం, మా అమ్మ ఎంత అమాయకురాలో. నువ్వేదో నోము నోచావనుకుంటున్నది, నువ్వింత దొంగ కోడలవని తెలుసుకోలేక మోసపోయింది."

"నేనా మీరా దొంగ. తల్లికి తెలియకుండా నాకు ఆపరేషన్ చేయించి, ఎవరికీ చెప్పవద్దని నాచేత చేతిలో చెయ్యి వేయించుకుని ఇప్పుడిల్లా అంటున్నారా?" అని అతని చేయి తన చేతిలోకి లాగుకున్నది.

"అమ్మతో కాకపోయినా, వియ్యంతో చెప్పే టైము వచ్చిందనుకుంటాను" అన్నాడు అతను. ఆలోచిస్తూ. నవ్వు అంతా పోయి, వాళ్లిద్దరి ముఖాల్లోనూ జాలి ఆవరించింది. వియ్యమ్మ పడుతూన్న అవస్థ వాళ్ళకూ భారంగా ఉంది. అవునన్నట్లు అతని కళ్లల్లోకి చూసింది రాజ్యలక్ష్మి.

# నుడి - నానుడి

తిరుమల రామచంద్ర

భాష ప్రవాహిని, నిలువ నీరుకాదు. విజ్ఞానం వికసించిన కొద్దీ భాషలో కొత్త పదాలు, పదబంధాలు, నుడులు నానుడులు ఏర్పడుతుంటాయి కొంతకాలానికి వాటి అర్థాలు మారిపోతుంటాయి మరి కొంత కాలానికి వాటి స్వరూపమే మారిపోతుంది. మరొక పదమేమో అనే భ్రాంతికూడ కలుగుతుంది కొన్ని పదాలు పూర్తిగా వ్యవహారచ్యుతమై పోయి పుస్తకాలలో మాత్రమే మిగిలిపోతాయి. వాటి అర్థాలు తెలుసుకొనడానికి మనం నిఘంటువులను ఆశ్రయించాలి వాటి పుట్టుపూర్వాలు తెలుసుకొనడానికి సజాతీయ భాషలను పరిశీలించవలసివుంటుంది.

ఉదాహరణకు కోటడు అనే పదం తీసుకుందాం. దీని అర్థం ఏమిటని ఎవరినైనా అడిగితే కోటయ్య అని వెంటనే సమాధానం చెబుతారు. ఇది శ్రీనాథుని కాలంలో వ్యవహారంలో వుండి వుంటుంది.

'చుక్కయొకింత నిక్కి బల
సూరను దిక్కున రాయుచుండుటన్
జక్కగ వేగదిప్పుడు ని
శానమయంబిది ప్రస్ఫుటంబుగా
ఘుక్కని మాటిమాటికిని
గోటడు పల్కెను వామదిక్కునం
జొక్కటిమై ఫలించు మన
కోటన కావ్యములెల్ల టిట్టిభా.'

అని క్రీడాభిరామంలో వల్లభరాయుడు ప్రయోగించాడు. ప్రయాణమై పోతున్నప్పుడు ఎడమవైపున గుడ్లగూబ కూస్తే మంచి శకునమనే సంప్రదాయం వున్నందున. ఈ పద్యంలో 'ఘుక్కని మాటిమాటికిని కోటడు పల్కెడు' అనే వాక్యంలో ఘుక్కనే అనుకరణ వాచకాన్నిబట్టి, ఘూక్ ఘూక్ అనే పక్షి ఘూకం—గూబ తప్ప మరొకటి కాదని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు కోటడు—గుడ్లగూబ అని అర్థం వ్రాశారు. విచిత్రమేమిటంటే తెలుగులో నేడు కరువైపోయిన యీమాట తెనుగు తోబుట్టువులయిన కన్నడ తమిళములలో నేటికీ వ్యవహారంలో వుండడం. దీనినిబట్టి కూడ మనం యీపదం అర్థం నిర్ధరించుకోవచ్చు. అర్థనిర్ధారణకూ, పదస్వరూప పరిజ్ఞానానికీ సజాతీయ భాషలతో తులనాత్మక పరిశీలన చాల ప్రయోజనకారి.

మరొకపదం పస్తు, పస్తు, పస్తుపడు, పస్తుండు అంటే ఏప్రాంతం తెలుగువారికైనా ఉపవాసం, ఉపవసించు అనే అర్థాలు వెంటనే స్ఫురిస్తాయి ఏ నిఘంటువు చూచినా, ఏ పదబంధకోశం చూచినా, దీనికి ప్రయోగాలుంటాయి.

'ఎన్నేళ్ళనుండియో ప
స్తున్నాడీ యడవిలోన నొంటి మహేశుండు.'

అని ధూర్జటి ప్రయోగించాడు. ఈమాట వింతగా ధ్వనించడం లేదూ? దీని పుట్టుపూర్వాలేమిటి? ఇది తెలుసుకొనడానికి మనం కన్నడ తమిళాలకు పోవలసివుంటుంది. కన్నడభాషలో పసి—ఆకలిగొను, ఆకలి అనే అర్థాలలో వుంది. పసివు, పసువు హసివు, హసువు, పసు, అనేవి రూపాంతరాలు, పసిదు—ఆకలిగొని "యుండు" అని అసమాపక క్రియ, తమిళంలో పసి—ఆకలి, పసిత్తల్ — ఆకలిగొను, ఆకలివల్ల కలిగే ఫలితాలు—దారిద్ర్యం, మొదలయిన అర్థాలు కూడా వున్నాయి దీనినిబట్టి పసిదు—అనే కన్నడరూపం వంటిది తెలుగులోను వుండేదని అదే కాలక్రమాన పస్తు అనే రూపం పొందిందని నిర్ణయించుకోవచ్చు. పస్తు- ఆకలిగొనియుండు—తదనంతరం బుద్ధిపూర్వకమైన ఆకలికి—ఉపవాసానికి— రూఢమయి వుంటుంది

కాటమరాజు కథను వినని తెలుగువాడుండడు. కాటమరాజుకు కరియావుల అనేది బిరుదు, కరి - నల్లని. ఆవులు. అతని మందలో హెచ్చుగా వున్నందున యీ బిరుదు వచ్చిందనే ప్రతీతి వుంది. కాని, పరిశీలించగా ఇది నిజం కాదని, ఇది కులబిరుదని స్పష్టమవుతుంది.

తమిళంలో కరైయాన్, కరైయాళన్ అనే పదాలున్నాయి అంటే తీరవాసి, తీరాధికారి అని అర్థం. తమిళనాడులో సముద్రతీరంలో నివసించే మత్స్యోపజీవులకు యీ పేరుంది సముద్రతీరం నివచ్చికబీళ్ళలో పసులను మేపుకొంటూ జీవించే యాదవులకు ఇది కులబిరుదు. కాటమరాజు వంశం యాదవులు. తమిళదేశం నుంచి తెలుగుదేశానికి వలసవచ్చి వుంటారు. ఆ బిరుదనామం ధరించి వుంటారు. కాటమరాజు కథ తమిళనాడులో ఏ సముద్రతీరంలోనో ఎప్పుడో జరిగివుంటుందని, సముద్రతీరం మీదుగా తెలుగుదేశానికి వలసవచ్చిన ఈ తమిళ యాదవుల కులగాథ నెల్లూరు రాజుల కథలో కాలక్రమానముడిపడి పోయిందని నాఅభిప్రాయం ఇది విషయాంతరం.. కొన్ని యాదవవంశాల ఆచారవ్యవహారాలు పరిశీలిస్తే ఇది స్పష్టమవుతోంది.

నీళ్ళాడు అనే పదం ఇప్పుడు ప్రసవించు అనే అర్థంలో రూఢమై పోయింది కాని, పూర్వం కేవలం స్నానసామాన్యార్థకంగానే వుంటూ క్రమంగా ప్రసవానికి వ్యవహరించబడుతూ నేడు స్నానార్థాన్ని కోల్పోయింది ఏ నిఘంటువు తిరగవేసినా, నీదాటి, నీరాటము. నీళ్ళాడు నీరాడు, మీఁగలాడు, జలకమాడు అనే పదాలు స్నానవాచకాలుగాను, ప్రసవవాచకాలుగాను కనిపిస్తాయి.

అతడు సరస్వతి నవగాహనము సేయుచుండియా చేరువ
నో ర్తురదువు గట్టక నీళ్ళాడగా జూడ....

అని తిక్కన భారత ప్రయోగం.

అంత బాలిక యాపురని యేడ్చు చిరుచప్పు
డాలించి వేకన నాకయింటి
కావలి వారు మేల్కని చూచి తలుపుల
తాళముల తొంటి విధమున నుండ
తెలిసి చక్కగ వచ్చి దేవకి నీళ్ళాడె
రమ్మ రమ్మని భోజరాజు తోడ
చెప్పిన.................

అని భాగవత ప్రయోగం తమిళంలో నీరట్టల్, నీరాట్టం అనేవి స్నానంచేయు, స్నానం అనే అర్థాలతో వున్నాయి. ప్రసవార్థకంలో లేవు. దీనివిబట్టి మొదట్లో తెలుగులోను ఇది స్నానసామాన్యార్థకంలో వుంది. క్రమంగా ప్రసవార్థకంగాను ఆ వ్యవహారానికి వచ్చి వుంటుంది. ఈ స్నానం విశిష్టమైంది. తల్లీ బిడ్డలు, జాతాశౌచంవల్ల ఇంటిల్లిపాది చేసేది గనుక విశేషార్థంలో ప్రయుక్తమై వుంటుంది, తర్వాత ఈ అర్థమే

(తరువాయి 40-వ పేజీలో)

# ప్రసార విశేషాలు

## అఖిల భారత సంగీత కార్యక్రమము



దేవవ్రతా చౌదరి: సితార్ (ఏప్రిల్ 20)

దేవవ్రతా చౌదరి సితార్ వాద్యము నందు శ్రీ॥ శ్రీ॥ ఆర్. బి. దత్తువద్ద శిక్షణ పొందెను. తరువాత ముస్తాక్ అలీఖాన్‌కు శిష్యుడయ్యెను. సంప్రదాయ సంగీతము నందు మంచి నేర్పుకలదు, అలాప్, జాడ్, ఝాలా, ఘటములను 'సెన్యా' పద్ధతిలో చక్కగా ఆలాపించగలరు. ప్రస్తుతము ఈయన ఢిల్లీ విశ్వవిద్యాలయములో వాద్య సంగీత ఉపాధ్యాయులుగా నున్నారు. విదేశములకు కూడా పోయి అనేక కచేరీలను గావించియున్నారు. దేవవ్రతా చౌదరి సితార్ వాద్యకచేరీని అఖిలభారత సంగీత కార్యక్రమమున ఏప్రిల్ 20-వ తేదీన వినవచ్చును.

మీరా బెనర్జీ తన తండ్రియగు శైలేంద్ర కుమార్ చటర్జీవద్ద మొదట సంగీతమునందు శిక్షణను బడసెను. పిమ్మట ఉస్తాద్ బడేగులాం అలీఖాన్‌వద్ద కూడా నేర్చుకొను భాగ్యము ఈమెకు దక్కినది. ఖయాల్ ఆలాపనయందు మంచి నేర్పు కలదు. ఈమె తుమ్రీగూడా చక్కగా పాడగలదు. మీరా బెనర్జీ గాత్ర సంగీతమును ఏప్రిల్ 27-వ తేదీ రాత్రి 9-30 గంటలకు అఖిలభారత సంగీత కార్యక్రమములో వినవచ్చును.




మీరా బెనర్జీ: గాత్రం (ఏప్రిల్ 27)

---

## పద్మావతీ పరిణయం

(హరికథ)

శ్రీ ని వా స స్వా మి ప ద్మా వ తీ కల్యాణమును గూర్చి ఎన్. సిహెచ్. కృష్ణమాచార్యుల సంగీతోపన్యాసమును విజయవాడ కేంద్రమునుండి ఏప్రిల్ 23వ తేదీ రాత్రి 9.30 గంటలకు వినవచ్చును.

## అలియదేవరు

నాటిక (కన్నడము)

అల్లుడు పదవగ్రహమని సంస్కృతమున ఒక సామెత కలదు. ఈ గ్రహ ప్రభావ మేమిటో జ్యోతిష్కునకు కూడా చెప్పతరము గాదు. జ్యోతిష్కునకు కూడా నలవికాని ఈ సమస్యను హాస్య రచయిత యగు దాశరథి దీక్షిత్ తన నాటిక 'అలియదేవరు' నందు శ్రోతలకు తెలియజేయుచున్నారు. ఈ నాటికను బెంగళూర్ కేంద్రమునుండి ఏప్రిల్ 22-వ తేదీ రాత్రి 9.30 గంటలకు వినవచ్చును.



జానకి సుబ్రహ్మణ్యం: గాత్రం (మద్రాస్, ఏప్రిల్ 18)

## మన వాగ్గేయకారులు

(రూపకం)

మన వాగ్గేయకారులు అను శీర్షికలో కర్ణాటక సంగీత పితామహుడగు 'పురందరదాసు' జీవితముపై రూపకాన్ని ఏప్రిల్ 21-వ తేదీ విజయవాడ కేంద్రం నుండి ఉదయం 8.30 గంటలకు బొమ్మరిల్లు పిల్లల కార్యక్రమములో వినవచ్చు.

## మత్తు నీళ్లు

(నాటిక)

మత్తు పానీయములను త్రాగుటచే కల్గు కీడులను గూర్చి తెలుపు నాటికయే 'మత్తునీళ్లు', ఎమ్. యెతిరాజాచార్యులు రచించిన 'మత్తునీళ్లు' నాటికను విజయవాడ కేంద్రంనుండి ఏప్రిల్ 20-వ తేదీ రాత్రి 7.45 గంటలకు వినవచ్చును.

## మద్రాస్-సి
(వివిధ భారతి)

193.6 మీ (1550 కి॥ సై)

వారములో అన్ని రోజులు (శనివారం మినహా)

ఉ॥ 7.00 నుండి 9.30
10.15 నుండి 12.30
మ॥ 2.00 నుండి 5.30
సా॥ 6.30 నుండి 10.40

(శనివారములు మాత్రం రాత్రి 6.30 నుండి 11.10)

[వివరాలు 44 వ పేజీలో]

## హైదరాబాద్-సి
245.9 మీ (1220 కి॥ సై)

వివిధభారతి (రిలే)

ఉ॥ 7.00 నుండి 9.30
10.15 నుండి 12.30
మ॥ 2.00 నుండి 5.30
సా॥ 6.30 నుండి 10.35

(శనివారములు మాత్రం రాత్రి 6.30 నుండి 11.10)

[వివరాలు 44-వ పేజీలో]

## తిరుచ్చి-బి
202.7 మీ (1480 కి॥ సై)

వివిధభారతి (రిలే)

ఉ॥ 7.00 నుండి 9.30
10.15 నుండి 12.30
మ॥ 2.00 నుండి 5.30
సా॥ 6.30 నుండి 10.40

(శనివారము సా॥ 6.30 నుండి రా॥ 11.10 వరకు)

[వివరాలు 44-వ పేజీలో]

## ప్రత్యేక వార్తా ప్రసారాలు

ప్రతిదినము ఉదయం 6.40 ప్రత్యేక వార్తా ప్రసారము

(ఢిల్లీ కేంద్రమునుండి ప్రసారమగు ఈ కార్యక్రమము మద్రాస్ బి, హైదరాబాద్, విజయవాడ, తిరుచ్చి, బెంగుళూర్ కేంద్రములు రిలే చేస్తాయి.)

వారంలో శనివారము తప్ప మిగతా రోజులలో

ప్రతిరోజూ రా॥ 10.30 గంటలకు ప్రత్యేక వార్తా ప్రసారము

శనివారం రా॥ 11.00 ప్రత్యేక వార్తా ప్రసారము

ఢిల్లీ కేంద్రమునుండి ప్రసారమగు పై రెండు కార్యక్రమాలు హైదరాబాద్, విజయవాడ, తిరుచ్చి, బెంగుళూర్ కేంద్రములు రిలే చేస్తాయి.

## వివిధ భాషలలో వార్తా ప్రసారాలు

### తెలుగు
ఉ॥ 7.00 నుండి 7.15 వరకు
మ॥ 1.50 నుండి 2.00 వరకు
సా॥ 7.00 నుండి 7.15 వరకు

### హిందీ
ఉ॥ 6.35 నుండి 6.40 వరకు
ఉ॥ 8.15 నుండి 8.30 వరకు
ఉ॥ 10.50 నుండి 10.55 వరకు
మ॥ 1.40 నుండి 1.50 వరకు
మ॥ 3.35 నుండి 3.40 వరకు
సా॥ 6.05 నుండి 6.10 వరకు
రా॥ 8.15 నుండి 8.30 వరకు
రా॥ 10.35 నుండి 10.50 వరకు
[శనివారాలలో రా॥ 11.05 నుండి 11.10 వరకు]

### ఆంగ్లం
ఉ॥ 6.40 నుండి 6.45 వరకు
ఉ॥ 8.00 నుండి 8.15 వరకు
ఉ॥ 10.55 నుండి 11.00 వరకు
మ॥ 1.30 నుండి 1.40 వరకు
మ॥ 3.30 నుండి 3.35 వరకు
సా॥ 6.00 నుండి 6.05 వరకు
రా॥ 8.00 నుండి 8.15 వరకు
రా॥ 10.35 నుండి 10.50 వరకు
[శనివారాలలో రా॥ 11.00 నుండి 01.05 వరకు]

### తమిళం
ఉ॥ 7.15 నుండి 7.30 వరకు
మ॥ 2.00 నుండి 2.10 వరకు
రా॥ 7.15 నుండి 7.30 వరకు

## హైదరాబాద్-ఏ

405.4 మీ 740 కిలోసై)
(89.42 మీ 3355 కిలోసై
ఉ॥ 6-30 నుండి 7-45 వరకు)
(42.02 మీ 7140 కిలోసై
ఉ॥8.00 నుండి 8-30 వరకు
(30.86 మీ 9720 కిలోసై
మ॥ 12-00 నుండి 3-00 వరకు
(62.50 మీ 4800 కిలోసై
సా॥ 5. 5 నుండి రా॥ 10-40 వరకు,

ఉ॥ ప్రసారము I

6-30ఉ వందేమాతరం, మంగళధ్వని కార్యక్రమ వివరణ
6-40 ఆంగ్లములో వార్తలు
6-45 భక్తిరంజని
7-00 తెలుగులో వార్తలు
7-15 విజయవాడవలె
7-45 సంకీర్తనం
7-55 సూక్తి ముక్తావళి
8-00 ఆంగ్లములో వార్తలు
8-15 హిందీలో వార్తలు
8-30ఉ వాతావరణ సూచన ప్రసార సమాప్తి

ప్రసారము II

12-30ఉ కార్మికుల కార్యక్రమము ప్రగతిపథం పాటలు‡
1-00 వనితావాణి (విజయవాడనుండి రిలే)
1-30 ఆంగ్లములో వార్తలు
1-40 చిత్రసీమ†
1-50 తెలుగులో వార్తలు
2-00 వాతావరణ సూచన ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

5-55ఉ స్థానిక ప్రకటనలు
6-00 ఆంగ్లములో వార్తలు
6-05 ప్రాంతీయ వార్తలు
6-15 ప్రాంతీయ వార్తలు (ఉర్దూ, హైదరాబాద్, కడపలు మాత్రమే)
6-25 ముఖ్య ప్రకటనలు విరామ సంగీతం
6-30 గ్రామస్థుల రేడియో గోష్ఠి కోళ్ళ పెంపకము సంభాషణ ధరలు, వాతావరణము
7-00 తెలుగులో వార్తలు
7-15 పద్యపఠనము: డా॥ పాటిబండ మాధవశర్మ బహుముఖ ప్రజ్ఞాశాలి: వీరేశలింగం ప్రసంగం
7-40 విరామ సంగీతం
7-45 రేడియో వార్తావాహిని
8-00 మీరుకోరిన పాటలు†
8-30 రైల్వే వారోత్సవాలు ప్రసంగం సి. శ్రీనివాసులు
8-40 వాద్య సంగీతం‡
8-50 Today in Parliament
9-00 ఆంగ్లములో వార్తలు
9-15 ఢిల్లీనుండి రిలే
9-30 విజయవాడ వలె
10 30 ఆంగ్లములో వార్తలు
10-35 హిందీలో వార్తలు
10-40 వాతావరణ సూచన, జనగణమన, ప్రసార సమాప్తి

## కడప

338.8 మీ (900 కిలోసై)
సా॥ 5-55 నుండి రా॥ 10-40 వరకు
శనివారములు మాత్రము
సా॥ 5-55 నుండి రా॥ 11-10 వరకు

## విశాఖపట్నం

322.6 మీ (93 కిలోసై)
సా॥ 5-55 నుండి రా॥ 10 40 వరకు

## విజయవాడ

357.1 మీ (840 కిలోసై)

ఉ॥ ప్రసారము I

6-00ఉ వందేమాతరం, శుభోదయం ప్రసార విశేషాలు
6-10 భక్తిరంజని: గణేశస్తుతి, చెంగల్వరాయశాస్త్రి కీర్తనలు
6-40 ఆంగ్లములో వార్తలు
6-45 సూక్తి ముక్తావళి
6-50 వాద్య సంగీతం:
7-00 తెలుగులో వార్తలు
7- 5 డి. పశుపతి: స్తోత్రం
7-45 సంగీత శిక్షణ: (జూనియర్లకు)
8-00 ఆంగ్లములో వార్తలు
8-15 హిందీలో వార్తలు
8-30 ప్రసార సమాప్తి

ప్రసారము II

1 -30ఉ కార్మికుల కార్యక్రమము (హైదరాబాద్ నుండి రిలే

## హైదరాబాద్-బి

288 మీ (1060 కిలోసై)

మ॥ ప్రసారము I

2-00* కాష్ఠతరంగ్: నిలయవిద్వాంసుడు
2-10 ఉర్దూలో వార్తలు
2-20 కాష్ఠతరంగ్: నిలయవిద్వాంసుడు
3-10ఉ ప్రసార సమాప్తి

ప్రసారము II

7-30 మల్లికార్జున్ మన్సూర్
8-00 మరాఠీ గీతాలు
8-30 Radio News Reel (relay from Delhi)
8-40 విలాయత్ ఖాన్: సితార్
9-00* చిత్రపట్ సే†
9-15 ఉర్దూలో వార్తలు
9-30 ఉర్దూలో కార్యక్రమము
10-00ఉ జనగణమన, ప్రసారసమాప్తి

## హైదరాబాద్-సి

245.9 మీ ( కిలోసై)
వివిధభారతి (రిలే)
వివరాలు 48 వ పేజీలో)

1-00 వనితావాణి స్త్రీల కార్యక్రమము పాట సీతమ్మగారి సలహాలు రచన: జనస్వామి హైమావతి వార్తావళి, మంగళం
1-30 ఆంగ్లములో వార్తలు
1-40 హిందీలో వార్తలు
1-50 తెలుగులో వార్తలు
2-00 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

ప్రసారము III

5-55ఉ స్థానిక ప్రకటనలు
6-00 ఆంగ్లములో వార్తలు
6-05 ప్రాంతీయ వార్తలు
6-15 పురాణ కాలక్షేపం (భారతమునుండి)
6-30 చిత్రతరంగిణి: ఫిల్మ్ సంగీతం‡
7-00 తెలుగులో వార్తలు
7-15 పంట సీమలు గ్రామీణ రేడియో గోష్ఠి ప్రశ్నలూ, జవాబులూ పండ్ల రసాలు నిలవ చేయుట ప్రసంగం మార్కెట్ ధరలు వాతావరణ వివరాలు
7-45 రేడియో వార్తావాహిని (హైదరాబాద్ నుండి రిలే)
8-00 లలిత సంగీతం: చిత్తూర్ వి. జయరాం
8-15 కందుకూరి వీరేశలింగం ప్రసంగం
8-30 ఢిల్లీనుండి రిలే
8-40 ప్రాదేశిక్ సుగమ్ సంగీత్†
8 50 Today in Parliament
9-00 ఆంగ్లములో వార్తలు
9-15 ఢిల్లీనుండి రిలే
9 30 పుల్లెల పేరిసోమయాజులు: వయొలిన్ కె. హనుమంతరావు: మృదంగం
10-30 ఆంగ్లములో వార్తలు
10-35 జనగణమన, ప్రసార సమాప్తి

## విజయవాడ-బి

00 మీ (1500 కిలోసై)
వివిధభారతి (రిలే)
(వివరాలు 48-వ పేజీలో)



* వరుసగా పూర్తిగా † గ్రామఫోను రికార్డ్ ‡ పూర్తిగా రికార్డింగ్

## మద్రాస్-ఏ

416.7 మీ (720 కిలోసై)
60-98 మీ (4920 కిలోసై)
ఉ॥ 6-30 నుండి 9-15 వరకు
81.28 మీ (9590 కిలోసై)
మ॥ 12-30 నుండి 2-10 వరకు
60,98 మీ (4920 కిలోసై)
సా॥ 6-05 నుండి రాత్రి 11-00 వరకు

### ఉ॥ ప్రసారము I

6-00* వందేమాతరం, మంగళగానం
6-05 తుదిప్పాడల్‌గళ్
6-80 నేటి కార్యక్రమ వివరణ, వాతావరణ సూచన
6-85 అరుళ్ వాక్కు
6-40 ఆంగ్లములో వార్తలు
6-45 సంగీతామృతం:
7-15 తమిళములో వార్తలు
7-80 అఖిలభారత రూపక కార్యక్రమము (తమిళం)
మహర్షి రామన్
హిందీ మాతృక: డా॥ రామధారిసింగ్ దినకర్
8-30 ఎస్. ఎమ్. నారాయణన్: గాత్రం
9-00 గీతమంజరి
9-15 ఎన్. రుక్మిణీ కృష్ణస్వామి: వీణ
9-45 ఆర్. ఎమ్. సుందరం: గాత్రం
10-80 మధుర గీతం
10-55 ఆంగ్లములో వార్తలు
11-00 ప్రసార సమాప్తి

### మ॥ ప్రసారము II

11-55 ప్రాంతీయ శెయిదిగళ్
12-00 కార్మికుల కార్యక్రమము
12-80 జానమ్మా డేవిడ్: గాత్రం
1-00 స్త్రీలకు (తమిళం)
1-80 వాద్యగోష్ఠి
1-.5 చిత్రగానం
కన్‌కండ దైవం
ఏళై పంగాళన్
ఇదయ కమలం
1-55 వాతావరణ సూచన,
2-00 తమిళములో వార్తలు
2-10 ప్రసార సమాప్తి

### ప్రసారము III

5-31* రుక్మిణీ కృష్ణస్వామి: వీణ
6.00 విరామ సంగీతం
.05 ప్రాంతీయ శెయిదిగళ్
6-15 కార్యక్రమ వివరణ, వాణిజ్య వార్తలు, ప్రత్యేక ప్రకటనలు వాతావరణ సూచన
6-80 Significa-ce of the National Crime Prevention week talk by R. M. Mahadevan
6-45 చిత్రగానం†
పెట్రాల్‌తాన్ పిళ్ళయా
తిరువిళయాడల్
అరనకట్టలై
అనుభవి రాజా అనుభవి
ఇరుమలర్‌గళ్
చంద్రోదయం
ఊటివరై ఉరవు, చిత్తి
7-15 తమిళంలో వార్తలు
7-80 వ్యవసాయదారులకు (తిరుచ్చినుండి రిలే)
8-00 పుస్తక సమీక్ష (తమిళం) రాజేశ్వరీ నటరాజన్
8-10 విరామ సంగీతం
8-80 జనతా నగర్
సీరియల్ నాటిక
రచన: ఎస్. పి. బాలకృష్ణన్
8-45 మెల్లిశై: గోష్ఠిగానం
9-00 ఆంగ్లములో వార్తలు
9-15 వాద్య సంగీతం
9-30 రేడియోనాటక సప్తాహం (తిరుచ్చినుండి రిలే)
10-80 University of the A.I. Correspondence Course for students
11-00 జనగణమన, ప్రసార సమాప్తి

## మద్రాస్-బి

### ఉ॥ ప్రసారము I

211.8 మీ (1420 కిలోసై)

6-57 వందేమాతరం, మంగళధ్వని
.00 తెలుగులో వార్తలు
7-15 సంగీత మంజరి:
అన్నపూర్ణాష్టకం: పళని విజయలక్ష్మి
7-80 వాద్య సంగీతం
8-00 ఆంగ్లములో వార్తలు
8-15 ప్రసార సమాప్తి

### మ॥ ప్రసారము II

211.3 మీ (1420 కిలోసై)

1-00 Western music: Victoria De Los Angeles (Soprano)
1-80 ఆంగ్లములో వార్తలు
1-40 హిందీలో వార్తలు
1-50 తెలుగులో వార్తలు
2-00 ప్రసార సమాప్తి

### సా॥ ప్రసారము III

11.8 మీ (1420 కిలోసై)
5-30 నుండి 6-05 వరకు
60.98 మీటర్లపైగూడా)

5-80* Western music: Marina Cocall (Soprano)
6-00 ఆంగ్లములో వార్తలు
6-05 మద్రాస్ ఏ వలె
.-30 పచన రచనా భగీరధులు
ప్రసంగం డి. చిన్నికృష్ణయ్య
ఫిల్మ్ సంగీతం
.00 తెలుగులో వార్తలు
7-15 సంగీతమంజరి†
అంబళపుళ సోదరులు;
ఎన్ చెల్లప్ప: నాదస్వరం
7 80 చిత్రగానం†
అన్బేవా, ఎంగపాప్పా
కందన్ కరుణై
సెల్వమగల్
కాదలిత్తాల్ పోదుమా
పాలాడై, శభాష్ తంబి
నెంజిరుక్కుంవరై
.-30 ఎస్. ఎమ్. నారాయణన్: గాత్రం
8-30 Radio News Reel (relay from Delhi)
8-40 విరామ సంగీతం
8-50 Today in Parliament
9-00 ఆంగ్లములో వార్తలు
9-15 ఢిల్లీనుండి రిలే
9-30 Western music: Music of the Austrian Alps
Vocal Gems from: Chuchin Chow
10-80 ఆంగ్లములో వార్తలు
10 85 వాతావరణ సూచన, జనగణమన, ప్రసార సమాప్తి

## మద్రాస్-సి

198.5 మీ (1550 కిలోసై)
వివిధభారతి (రిలే)
(వివరాలు 48-వ పేజీలో)

## బెంగుళూరు

### ప్రసారము I

6-30* వందేమాతరం, మంగళధ్వని
6-10 ఆంగ్లములో వార్తలు
6-15 కార్యక్రమ వివరణ
6-50 గీతారాధన
7-15 పి. ఎస్. లీలావతి‡
-45 కన్నడములో వార్తలు
8-00 ఆంగ్లములో వార్తలు
8 15 శ్రీరంగం గోపాలరత్నం: బసవేశ్వర వచన
8 80* ప్రసార సమాప్తి

### మ॥ ప్రసారము II

[బెంగుళూరు మాత్రమే]

12-30* వనితావిహార
1-10 కన్నడములో వార్తలు
1-20 కన్నడగీతె
1-80 ఆంగ్లములో వార్తలు
1-40 హిందీలో వార్తలు
1-50 కన్నడగీతె
.00* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

### సా॥ ప్రసారము III

5-80* కార్మికుల కార్యక్రమము
6-00 ఆంగ్లములో వార్తలు
6-05 స్థానిక ప్రకటనలు వాతావరణ సూచన, (ఆంగ్లం)
6-10 వేణువు†
6-15 మనెయమాతు
6-25 వృందగాన†
6-85 ప్రదేశ సమాచార
6-45 చిత్రగీతె†
-00 గ్రామస్థులకు
7-45 కన్నడములో వార్తలు
8-00 ఆటల సమీక్ష (కన్నడం)
8-10 వాద్యశ్రీ†
8-1, ముఖవీణ
8-80 ఢిల్లీనుండి రిలే
8-40 వాద్యశ్రీ†
8-45 నవసుమ: వె. ఎస్. ఇందిర
8-50 Today in Parliament
9-00 ఆంగ్లములో వార్తలు
9-.5 సమాచార దర్శన
9-25 వాద్య సంగీత†
9-30 ఎమ్. ఎల్. వసంతకుమారి: గాత్రం
1) 30 ఆంగ్లములో వార్తలు
10 85 వాతావరణ సూచన జనగణమన, ప్రసార సమాప్తి



* సమయ సూచన † గ్రామఫోన్ రికార్డ్ ‡ స్టూడియో రికార్డింగ్

## బుధవారం ఏప్రిల్ 17

శక 1890 చైత్ర 28

## హైదరాబాద్-ఏ

405.4 మీ (740 కిలోసై)

[62.50 మీ (4800 కిలోసై)

ఉ॥ 6-00 నుండి 7-45 వరకు]

(49,02 మీ 6110 కిలోసై)

ఉ॥ 6-30 నుండి 8-30 వరకు

(42-02 మీ 7140 కిలోసై)

మ॥ 12-30 నుండి 2-00 వరకు

(62-50 మీ 4800 కిలోసై)

సా॥ 5-55 నుండి రా॥ 10-40 వరకు)

ఉ॥ ప్రసారము I

6-30* వందేమాతరం, మంగళధ్వని కార్యక్రమవివరణ

6-40 అంగ్లములో వార్తలు

6-45 భక్తిరంజని

7-00 తెలుగులో వార్తలు

7 15 వి. సరస్వతి: వీణ

7-45 సంకీర్తనం

7-55 సూక్తిముక్తావళి

8-00 అంగ్లములో వార్తలు

8-15 హిందీలో వార్తలు

8-30* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12-30* కార్మికుల కార్యక్రమము (విజయవాడనుండి రిలే)

1.00 మహిళా సమాజం స్త్రీల కార్యక్రమము
శ్రోతలుకోరిన పాట
శశిరేఖ నాటిక
మాటా మంతీ

4C అంగ్లములో వార్తలు

1-40 చిత్రగీతాలు†

1-50 తెలుగులో వార్తలు

2-00 వాతావరణసూచన ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

5-55* స్థానిక ప్రకటనలు

6 00 అంగ్లములో వార్తలు

6-05 ప్రాంతీయ వార్తలు

6-15 ప్రాంతీయ వార్తలు (ఉర్దూ) (హైదరాబాద్, కడపలు మాత్రమే)

6-25 ముఖ్య ప్రకటనలు
విరామ సంగీతం

6-30 వ్యాపసాయిక విషయాలు: అనంతపూర్ జిల్లాలో కలబంద ప్రసంగం
ఆహార శక్తి సంయోగ్రత్తలు ప్రసంగం
ధరలు వాతావరణం

7-00 తెలుగులో వార్తలు

7-15 వెలుగు బాట

7-30 చిత్రసీమ†

7-45 మునిసిపాలిటీల చట్టము ముఖ్యాంశాలు ప్రసంగం

7-55 విరామ సంగీతం

8.00 నాటిక

8-30 వి. సరస్వతి: వీణ

8-50 Today in Parliament

9-00 అంగ్లములో వార్తలు

9-15 ఢిల్లీనుండి రిలే

9-30 Training for Leadership: Role of Youth Movement in Development talk by M. N. Srinivas (relay from Delhi)

9-45 లలిత సంగీతం: సి. వరలక్ష్మి

10-00 వి. సరస్వతి: వీణ

10-30 అంగ్లములో వార్తలు

10-35 హిందీలో వార్తలు

10-40 ప్రసార సమాప్తి

## కడప

838.3 మీ (900 కిలోసై)

సా॥ 5-55 నుండి 10-40 వరకు

శనివారములు మాత్రము

సా॥ 5-55 నుండి రా॥ 11-10

## విశాఖపట్నం

822,6 మీ (980 కిలోసై)

సా॥ 5-55 నుండి రా॥ 10-40 వరకు

## విజయవాడ

457.9 మీ (840 కిలోసై)

ఉ॥ ప్రసారము I

6-00* వందేమాతరం, సుభోదయం, ప్రసార విశేషాలు

6-10 భక్తిరంజని: వెంకటేశ్వర సుప్రభాతం కనకదాస కీర్తనలు

6-40 అంగ్లములో వార్తలు

6 45 సూక్తి ముక్తావళి

-50 వాద్య సంగీతం:

7-00 తెలుగులో వార్తలు

7-15 హైదరాబాద్ వలె

7-45 హిందీ పాఠము

8-00 అంగ్లములో వార్తలు

8-15 హిందీలో వార్తలు

8-30 ప్రసార సమాప్తి

## హైదరాబాద్-బి

288 మీ (1060 కిలోసై)

ఉ॥ ప్రసారము I

2-00* చిత్రపట్ సే†

2-10 ఉర్దూలో వార్తలు

-0 సుగం సంగీత్ వసంత్ పి. గాడ్సే

2-30 వాద్య సంగీత్†

2-50 సుగం సంగీత్ వసంత్ పి. గాడ్సే

3-00* ప్రసార సమాప్తి

ప్రసారము II

7-30* యునూస్ హుస్సేన్ ఖాన్

8-00 మాలినీ రాజన్‌కర్: ఖయాల్

8-30 సుగం సంగీత్:

8-4 జనపదగేయాలు

9-00 చిత్రపట్ సే†

9-15 ఉర్దూలో వార్తలు

9-30 ఉర్దూలో కార్యక్రమము

10-00* జనగణమన, ప్రసారసమాప్తి

## హైదరాబాద్-సి

245.9 మీ (1220 కిలోసై)

వివిధభారతి (రిలే)

[వివరాలు 44-వ పేజీలో

మ॥ ప్రసారము II

12-30* కార్మికుల కార్యక్రమము
ఫిల్మ్ సంగీతం†
సైరన్ కూసింది నాటిక
రచన: పాలపర్తి సుముఖేశ్వరరావు
విశేషాలు

1-00 మహిళా సమాజం
స్త్రీల కార్యక్రమము
(హైదరాబాద్‌నుండి రిలే)

1-30 అంగ్లములో వార్తలు

1-40 హిందీలో వార్తలు

1-50 తెలుగులో వార్తలు

2-00 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

5-55* స్థానిక ప్రకటనలు

6-00 అంగ్లములో వార్తలు

6-05 ప్రాంతీయ వార్తలు

6-15 వాద్య బృందం

6-30 మధువన్ హిందీ కార్యక్రమము

6-45 బజారు ధరలు
వెలుగుబాట

7-00 తెలుగులో వార్తలు

7-15 పంటసీమలు
సమాధాన సరళి
వాతావరణము

7-45 ఈనెల పాట

7-50 సుబుద్ధ సంగీత్†

8 C0 అడుగుజాడలు నాటిక

8.30 చిత్రతరంగిణి-ఫిల్మ్ సంగీతం†

8-50 Today in Parliament

9-00 అంగ్లములో వార్తలు

9-15 ఢిల్లీనుండి రిలే

9-30 National programme of talks (relay from Delhi)

9-45 లలిత సంగీతం† బుర్గుల రామమూర్తి

10-00 మదురై మణి అయ్యర్†

10-30 అంగ్లములో వార్తలు

10-35 జనగణమన, ప్రసార సమాప్తి

## విజయవాడ—బి

800 మీ (1500 కిలోసై)

వివిధభారతి (రిలే)

వివరాలు 44-వ పేజీలో



* సమయ సూచన † గ్రామఫోన్ రికార్డ్ ‡ స్టూడియో రికార్డింగ్

బుధవారం ఏప్రిల్ 17

శక 1889 చైత్ర 28

## మద్రాస్-ఎ

4 6.7 మీ 720 కిలోసైకిల్స్
6 .98 మీ 4920 కిలోసైకిల్స్
ఉ॥ 6.30 నుండి 9.15 వరకు
31.28 మీ 9590 కిలోసైకిల్స్
మ॥ 11.55 నుండి 2.10 వరకు
60.98 మీ 4920 కిలోసైకిల్స్
సా॥ 6.05 నుండి రాత్రి 11.10 వరకు

ఉ॥ ప్రసారము I

6-00* వందేమాతరం, మంగళవాద్యం
6-05 తుదిప్పాడల్‌గళ్
6-30 నేటి కార్యక్రమ వివరణ వాతావరణ సూచన
6-35 అరుళ్ వాక్కు
6-40 ఆంగ్లములో వార్తలు
6-45 సంగీతామృతం టి. ఆర్. సుబ్రమణ్యం
7-15 తమిళములో వార్తలు
7-30 పాటూలైన్†
ఎమ్. బాలమురళీ కృష్ణ
8-15 లలితా కృష్ణమూర్తి: గాత్రం
8 45 చిత్రగానం†
9-15 తిరుప్పాపులియూర్ వి. రాజం: వయొలిన్
9-45 వాద్యసంగీతం: వీణ
10-00 టి. కె. వెంకటరామన్: గాత్రం
10-30 మధుర గీతం
10-55 ఆంగ్లములో వార్తలు
11-00 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

11-55 ప్రాంతీయ వార్తలు
12-00* కార్మికుల కార్యక్రమము
12-30 తిరుప్పాపులియూర్ వి. రాజం: వయొలిన్
1-00 పెణ్ణులగం స్త్రీలకు (తిరుచ్చినుండి రిలే)
1-30 వాద్యగోష్ఠి
1-45 చిత్రగానం†
సర్వర్ సుందరం
పేసుం దైవం
తనిప్పిఅవి
1-55 నాటిక సూచన
2-00 తమిళములో వార్తలు
2-10 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

5-30* సంగీత పాఠము
5-45 పాట్లలైన్
జి. వైదేహి
ఎ. ఎమ్. రాజా

6-00 విరామసంగీతం
6-00 ప్రాంతీయ శెయిదిగళ్
6-15 కార్యక్రమ వివరణ
వాణిజ్య వార్తలు,
ప్రత్యేక ప్రకటనలు,
వాతావరణ సూచన,
6-30 ప్రసంగము (తమిళం)
పి. కుప్పుస్వామి
6-4.. చిత్రగానం†
మేజర్ చంద్రకాంత్
నానోడి, సెల్వం
వివసాయి
మోటార్ సుందరంపిళ్లై
వాలిబవిరుందు
మద్రాస్ టు పాండిచ్చేరి
పొన్నానవాళ్వు
7-15 తమిళములో వార్తలు
-30 వ్యవసాయదారులకు (తిరుచ్చినుండిరిలే)
8-00 వాళ్కయిన్ లక్షయం పరిచయం (తమిళం)
8-10 విరామ సంగీతం
8-15 Calling the youth: Shakespeareana: A miscellany from the plays of Shakespeare
8-45 Radio News Reel (relay from Delhi)
9-00 ఆంగ్లములో వార్తలు
9-15 Small industries abroad: Hong Kong talk by A. M. Kumaraswami Iyer
9-30 రేడియో నాటక సప్తాహం (తిరుచ్చినుండి రిలే)
10-00 చిత్రగానం†
10-30 University of the Air Correspondence Course for Students
11 00 జనగణమన, ప్రసార సమాప్తి

## మద్రాస్-బి

211.8 మీ 1420 కిలోసైకిల్స్

ఉ॥ ప్రసారము I

6-57 వందేమాతరం, మంగళధ్వని
7-00 తెలుగులో వార్తలు
7-15 సంగీత మంజరి
శివానంద విజయలక్ష్మి
7-30 మద్రాసు ఎ రిలే
8-00 ఆంగ్లములో వార్తలు
8-15 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

211.8 మీ (1420 కిలోసైకిల్స్)

00 Western music: Highlights from "The Pirates of Penzance: Gilbert and Sullivan"
1-30 ఆంగ్లములో వార్తలు
1-40 హిందీలో వార్తలు
1-50 తెలుగులో వార్తలు
2-00 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

211.8 మీ 1420 కిలోసైకిల్స్
[సా॥ 5.30 నుండి 6.05 వరకు 60.98 మీటర్లపై గూడా]

5-30* Western music: Kirby Stone Four
6-00 ఆంగ్లములో వార్తలు
6-05 మద్రాస్ ఎ రిలే
6-30 నాటిక
7-00 తెలుగులో వార్తలు
7-15 సంగీత మంజరి†
ఎస్. బాలచందర్, వీణ
7-30 చిత్రగానం†
తాయి సొల్లై తట్టాదె
అరుణగిరి నాథర్, రాము
పల్లవన్ ఒరువన్
పట్టణత్తిల్ భూతం
సీత, రాజావిట్టు పత్తి
మహారాణి
8-00 అంజలి
8-15 లలితా కృష్ణమూర్తి: గాత్రం
8-45 విరామ సంగీతం
8-50 Today in Parliament
9-00 ఆంగ్లములో వార్తలు
9-15 ఢిల్లీనుండి రిలే
9-30 Training for Leader-ship: Role of the Youth movement in develop-ment talk by M. N. Srinivas (relay from Delhi)
9-45 వాద్య సంగీతం
10-00 Western music: Ambrose and his orchestra
10-30 ఆంగ్లములో వార్తలు
10-3 వాతావరణ సూచన, జనగణమన, ప్రసారసమాప్తి

## మద్రాస్-సి

193.5 మీ (1550 కిలోసైకిల్స్)
వివిధభారతి (రిలే)
[వివరాలు 44వ పేజీలో

## బెంగుళూరు

ఉ॥ ప్రసారము I

491.8 మీ (610 కిలోసైకిల్స్)

6-30* వందేమాతరం మంగళధ్వని
6-40 ఆంగ్లములో వార్తలు
6-45 కార్యక్రమ వివరణ
6-50 శివారాధన
7-15 చందా హుస్సేన్: సారంగి
7-45 కన్నడములో వార్తలు
8-00 ఆంగ్లములో వార్తలు
8-15 గానవిహార
8-30 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12-30 ఎమ్. ఎ. నరసింహాచార్: గాత్రం
జె. ఎల్. కాశీనాథశాస్త్రి, వయొలిన్
ఎ. రాజాచార్: మృదంగం
1-10 కన్నడములో వార్తలు
1-20 హెచ్. ఎన్. అనసూయ: దేవరనామ
1-30 ఆంగ్లములో వార్తలు
'-40 హిందీలో వార్తలు
1-50 హెచ్. ఎన్. అనసూయ: దేవరనామ
2-00 వాతావరణ సూచన ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

5-30* కార్మికుల కార్యక్రమం
6-00 ఆంగ్లములో వార్తలు
6-05 స్థానిక ప్రకటనలు వాతావరణ సూచన (ఆంగ్లం)
6-10 వీణ†
6-15 సాహిత్య సాంస్కృతిక కార్యక్రమము (ఉర్దూ)
6-30 లలిత సంగీత†
6-35 ప్రదేశ సమాచార
6-45 చిత్రగీత†
7-00 గ్రామస్థులకు
7-45 కన్నడములో వార్తలు
8-00 సాహిత్య వాహిని
8-20 గీతగుచ్ఛ
8 30 చందా హుస్సేన్: సారంగి
8-50 Today in Parliament
9-00 ఆంగ్లములో వార్తలు
9-15 చిత్ర గీత†
9-30 ఢిల్లీనుండి రిలే
‡9-50 ఆర్. కె. సూర్యనారాయణ: వీణ
10-30 ఆంగ్లములో వార్తలు
10-35 వాతావరణ సూచన జనగణమన, ప్రసార సమాప్తి

* సమయ సూచన † గ్రామఫోన్ రికార్డు ‡ స్టూడియో రికార్డింగ్

## గురువారం ఏప్రిల్ 18

శక 1890 చైత్ర 29

## హైదరాబాద్-ఎ

405.4 మీ (740 కిలోసై)

[62.50 మీ (4800 కిలోసై)
ఉ॥ 6.30 నుండి 7.45 వరకు]

[42.02 మీ (7140 కిలోసై)
ఉ॥ 8.00 నుండి 8.30 వరకు]

[30.86 మీ (9720 కిలోసై)
మ॥ 12.30 నుండి 2.00 వరకు

[62.50 మీ 4800 కిలోసై)
సా॥ 5.55 నుండి రా॥ 10.40 వరకు

ఉ॥ ప్రసారము I

6.30ఉ వందేమాతరం, మంగళధ్వని కార్యక్రమ వివరణ
6.40 ఆంగ్లములో వార్తలు
6.45 భక్తిరంజని
7.00 తెలుగులో వార్తలు
7.15 సంగీత శిక్షణ (విజయవాడనుండి రిలే)
7.30 గానసుధ†
7.45 వాద్యగోష్ఠి
7.55 సూక్తి ముక్తావళి
8.00 ఆంగ్లములో వార్తలు
8.15 హిందీలో వార్తలు
8.30ఉ వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12.30ఉ కార్మికుల కార్యక్రమము
మీకు తెలుసా?
పాటలు†
1.00 ఎమ్. ఎస్. మహదేవన్: గాత్రం
1.30 ఆంగ్లములో వార్తలు
1.40 చిత్రసీమ†
1.50 తెలుగులో వార్తలు
2.00ఉ వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

ప్రసారము III

5.55ఉ స్థానిక ప్రకటనలు
6.00 ఆంగ్లములో వార్తలు
6.05 ప్రాంతీయ వార్తలు
6.15 ప్రాంతీయ వార్తలు (ఉర్దూ) (హైదరాబాద్, కడపలు మాత్రమే)
6.25 బజారు ధరలు
6.30 బాలవిహార్
చిట్టి ముత్యాలు
కదంబ కార్యక్రమము
సమర్పణ: బాలబాలికలు
గ్రామ బాలసంఘ వార్తలు
చిక్కు ప్రశ్న
7.00 తెలుగులో వార్తలు
7.15 పురాణ కాలక్షేపం
7.30 చిత్రసీమ†
7.45 రాగం, తానం, పల్లవి (విజయవాడనుండి రిలే)
8.30 పరిచయ పత్రం
8.45 విరామ సంగీతం
8.50 Today in Parliament
9.00 ఆంగ్లములో వార్తలు
9.15 ఢిల్లీనుండి రిలే
9.30 Debate (relay from Delhi)
10.00 మారిన మనసు నాటిక
10.30 ఆంగ్లములో వార్తలు
10.35 హిందీలో వార్తలు
10.40 వాతావరణ సూచన, జనగణమన, ప్రసారసమాప్తి

## కడప

333.3 మీ (900 కిలోసై)

సా॥ 5.55 నుండి రా॥ 10.40 వరకు

శనివారములు మాత్రము

సా॥ 5.55 నుండి రా॥ 11.10

## విశాఖపట్నం

322.6 మీ (930 కిలోసై)

సా॥ 5.55 నుండి రా॥ 10.40 వరకు

## విజయవాడ

357.1 మీ (840 కిలోసై)

ఉ॥ ప్రసారము I

6.00ఉ వందేమాతరం, శుభోదయం, ప్రసార విశేషాలు
6.10 భక్తిరంజని:
సంప్రదాయ కీర్తనలు
నవావరణ కీర్తన
6.40 ఆంగ్లములో వార్తలు
6.45 సూక్తి ముక్తావళి
6.50 ఎమ్. ఎస్. సుబ్బులక్ష్మి†
7.00 తెలుగులో వార్తలు
7.15 సంగీత శిక్షణ (సీనియర్లకు)
7.30 షేక్ నబీ సోదరులు:నాదస్వరం
8.00 ఆంగ్లములో వార్తలు
8.15 హిందీలో వార్తలు
8.30 ప్రసార సమాప్తి

## హైదరాబాద్-బి

283 మీ (1060 కిలోసై)

ప్రసారము I

2.00ఉ ఎల్. రాయన్న: క్లారినెట్
2.10 ఉర్దూలో వార్తలు
2.20 సుగమ సంగీత్
2.30 ఎల్. రాయన్న: క్లారినెట్
2.50 సుగమ సంగీత్
3.00ఉ ప్రసార సమాప్తి

ప్రసారము II

7.30ఉ అప్కీ పసంద్†
8.00 ప్రసంగం (హిందీ)
డా॥ కైలాస్ చంద్రదేవ్ బృహస్పతి
8.15 సుబద్ధ సంగీత†
అమియ రంజన్ బెనర్జీ
హఫీజ్ అహమద్‌ఖాన్
8.30 Radio News Reel (relay from Delhi)
8.40 ఎల్. రాయన్న: క్లారినెట్
9.00 చిత్రపట్ సే†
9.15 ఉర్దూలో వార్తలు
9.30 ఉర్దూలో కార్యక్రమము
10.00ఉ జనగణమన, ప్రసారసమాప్తి

## హైదరాబాద్-సి

245.9 మీ (1220 కిలోసై)

వివిధభారతి (రిలే)

[వివరాలు 44-వ పేజీలో]

ప్రసారము II

12.30ఉ కార్మికుల కార్యక్రమము (హైదరాబాద్‌నుండి రిలే)
1.00 షేక్ నబీ సోదరులు:నాదస్వరం
1.30 ఆంగ్లములో వార్తలు
1.40 హిందీలో వార్తలు
1.50 తెలుగులో వార్తలు
2.00 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

5.55ఉ స్థానిక ప్రకటనలు
6.00 ఆంగ్లములో వార్తలు
6.05 ప్రాంతీయ వార్తలు
6.15 గ్రామలక్ష్మి
కదంబ కార్యక్రమము
సమర్పణ: దెందులూరు మహిళాసమాజం
6.30 చిత్రతరంగిణి-ఫిల్మ్ సంగీతం†
7.00 తెలుగులో వార్తలు
7.15 పంటసీమలు
కృషివిజ్ఞానము
వేసవి పండ్లతోటలు
జీడిమామిడి చర్చ
వాతావరణ వివరాలు
7.45 రాగం, తానం, పల్లవి:
ఎస్. ఆర్. జానకిరామన్: గాత్రం
డి. పాండురంగరాజు: వయొలిన్
జి. సింహాచలశాస్త్రి: మృదంగం
8.30 Radio News Reel (relay from Delhi)
8.40 గానసుధ†
8.50 Today in Parliament
9.00 ఆంగ్లములో వార్తలు
9.15 ఢిల్లీనుండి రిలే
9.30 Debate (relay from Delhi)
10.00 వి. బి. కనకదుర్గ: గాత్రం
10.30 ఆంగ్లములో వార్తలు
10.35 జనగణమన, ప్రసారసమాప్తి

## విజయవాడ—బి

200 మీ (1500 కిలోసై)

వివిధభారతి (రిలే)

[వివరాలు 44-వ పేజీలో]



* సమయ సూచన  † గ్రామఫోన్ రికార్డ్  ‡ స్టూడియో రికార్డింగ్

సోమవారం ఏప్రిల్ 29
శక 1889 వైశాఖ 9

## మద్రాస్-ఏ

416.7 మీ (720 కిలోసై)
60.98 మీ (4920 కిలోసై)
ఉ॥ 6-30 నుండి 9-15 వరకు
31.28 మీ (9590 కిలోసై)
మ॥ 11-55 నుండి 2-10 వరకు
60.98 మీ (4920 కిలోసై)
సా॥ 6-05 నుండి రా॥ 11-00 వరకు

ఉ॥ ప్రసారము I

6-00⊕ వందేమాతరం, మంగళధ్వని
6-05 తుదిప్పాడల్‌గళ్
6-30 నేటి కార్యక్రమ వివరణ
వాతావరణ సూచన
6-35 అరుళ్ వాక్కు
6-40 ఆంగ్లములో వార్తలు
6-45 మల్లైవళి
6-55 వి. మాణిక్యం: నాదస్వరం
7-15 తమిళములో వార్తలు
7-30 కె. ఎస్. నారాయణస్వామి:వీణ
ముచింద్రం కృష్ణన్:మృదంగం
8-45 చిత్రగానం†
9-15 ఊదవి నాటిక (తమిళం)
9-45 సంగీతమంజరి
పి. ఎ. పెరియనాయకి
10-00 వి. మాణిక్యం: నాదస్వరం
10-30 మధుర గీతం
10-55 ఆంగ్లములో వార్తలు
11-00 ప్రసార సమాప్తి

ప్రసారము II

11-55 ప్రాంతీయ శెయిదిగళ్
12-00 కార్మికుల కార్యక్రమము
12-30 ఎన్. రాజాంబాళ్: గాత్రం
1-00 స్త్రీలకు (తమిళం)
1-20 వాద్య గోష్ఠి
1-45 చిత్రగానం†
సుమైతాంగే
పెతియకోయిల్
కందన్ కరుణై
1-55 వాతావరణ సూచన
2-00 తమిళములో వార్తలు
2-10 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

5-30⊕ సంగీత పాఠము
5-45 మెల్లిసై:
ఎల్. కృష్ణన్
లీలావతి గోపాలకృష్ణన్
6-00 విరామ సంగీతం
6-05 ప్రాంతీయ శెయిదిగళ్
6-15 కార్యక్రమ వివరణ
వాణిజ్య వార్తలు
ప్రత్యేక ప్రకటనలు
వాతావరణ సూచన
6-30 స్వామిమలై రూపకం
(తిరుచ్చినుండి రిలే)
6-45 చిత్రగానం†
తై, వివసాయి
పొన్నానవాళ్వు
శభాష్ తంబి
ఊటివరై ఉరవు
పూవుం పొట్టుం
కాదలిత్తాల్ పోదుమా
మాడి ట్టు మాప్పిళ్ళై
7-15 తమిళంలో వార్తలు
7-30 వ్యవసాయదారులకు
(తిరుచ్చినుండి రిలే)
8-00 నేయర్ విరుప్పం
(శ్రోతలుకోరిన పాటలు)
8-30 సంస్కృత కార్యక్రమము
శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి
(శ్రీ శంకరాచార్య కామకోటి
పీఠాధిపతి) ప్రసంగముల
నుండి కొన్నిఘట్టాలు
8-50 మెల్లిసై:
ఎస్. ఎస్. దండపాణి
టి. కె. రాధ
9-00 ఆంగ్లములో వార్తలు
9-15 ప్రసంగం (తమిళం)
(తిరుచ్చినుండి రిలే)
9-30 గాంధీజీ ఆత్మకథ పఠనం
(తమిళం)
9-45 రాగం, తానం, పల్లవి
డి. కె. జయరామన్: గాత్రం
ఎ. ఎల్. వేదగిరి: వయొలిన్
పాల్ఘాట్ కె. కుంజుమణి:
మృదంగం
10-30 చిత్రగానం†
రాజావీట్టుపిళ్ళై, తిరుడాదె
సర్వర్ సుందరం
తనిప్పిరవి
నిలైవిల్ నిన్రవళ్
కావల్ కారన్
ఇరుమలర్‌గళ్, కర్పూరం
11-00 జనగణమన, ప్రసార సమాప్తి

## మద్రాస్-బి

ఉ॥ ప్రసారము I
211.3 మీ (1420 కిలోసై)

6-57 వందేమాతరం, మంగళధ్వని
7-00 తెలుగులో వార్తలు
7-15 [illegible]
[illegible]
8-00 ఆంగ్లములో వార్తలు
8-5 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II
211.3 మీ (1420 కిలోసై)

1-00 Western music:
Selections from
Show Boat
1-30 ఆంగ్లములో వార్తలు
1-40 హిందీలో వార్తలు
1-50 తెలుగు [illegible]
2-00 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III
211.3 మీ (1420 కిలోసై)
[సా॥ 5-30 నుండి 6-05 వరకు
60.98 మీటర్లపైగూడా]

5-30⊕ Western music
Jackie Gleason and
his orchestra
6-00 ఆంగ్లములో వార్తలు
6-05 మద్రాస్ ఎ వలె
6-30 మల్లె పందిరి కథానిక
రచన: కొట్ర మల్లికార్జునశర్మ
ఫిల్మ్ సంగీతం:
7-00 తెలుగులో వార్తలు
7-15 గీతమాలిక
7-30 పాపమాలై†
టి. ఆర్ మహాలింగం:వేణువు
8-00 భారతిదాసన్‌పై రూపకం
(తమిళం)
(తిరుచ్చినుండి రిలే)
8-30 Sports round-up
(relay from Delhi)
8-40 విరామ సంగీతం
8-50 Today in Parliament
9-00 ఆంగ్లములో వార్తలు
9-15 ఢిల్లీనుండి రిలే
9-30 చాయావాద్
ప్రసంగం హిందీ)
ప్రొ॥ నంజుండన్
9-45 వాద్య సంగీతం:
వయొలిన్‌యుగళం
10-00 హిందూస్తానీ సంగీతం†
తుమ్రీ
10-30 ఆంగ్లములో వార్తలు
10-35 వాతావరణ సూచన,
జనగణమన, ప్రసార సమాప్తి

## మద్రాస్-సి

198.5 మీ (1550 కిలోసై)
వివిధభారతి (రిలే)
[వివరాలు 48-వ పేజీలో]

## బెంగుళూరు

ఉ॥ ప్రసారము I

6-30⊕ వందేమాతరం, మంగళధ్వని
6-40 ఆంగ్లములో వార్తలు
6-45 కార్యక్రమ వివరణ
6-50 భజనారాధన
7-15 టి. నాగమ్మ: గాత్రం
7-45 కన్నడములో వార్తలు
8-00 ఆంగ్లములో వార్తలు
8-15 గాంధీజీ ఆత్మకథ పఠనము
8-30 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II
బెంగళూరు మాత్రమే)

12-10* టి. నాగమ్మ: గాత్రం
ఎమ్. కె. కృష్ణన్: వయొలిన్
ఎస్. ప్రకాశ్: మృదంగం
1-00 గానామృత†
1-10 కన్నడములో వార్తలు
1-2 హిందీగీత్†
1-30 ఆంగ్లములో వార్తలు
1-40 హిందీలో వార్తలు
1-50 హిందీ భజన్†
2-00⊕ వాతావరణ సూచన,
ప్రసార సమాప్తి

ప్రసారము III

5-30⊕ కార్మికుల కార్యక్రమము
6-00 ఆంగ్లములో వార్తలు
6-0 స్థానిక ప్రకటనలు
వాతావరణ సూచన (ఆంగ్లం)
6-10 నాదస్వరం†
6-15 ఉర్దూలో పాటలు
6-25 కన్నడ గీతాలు
6-35 ప్రదేశ సమాచార
6-45 చిత్రగీత్†
7-00 గ్రామస్థులకు
7-45 కన్నడములో వార్తలు
8-00 శ్రోతలుకోరిన పాటలు
8-30 ఢిల్లీనుండి రిలే
8-40 కోరిక†
8-50 Today in Parliament
9-00 ఆంగ్లములో వార్తలు
9-15 Employees State
Insurance scheme:
talk by
K. C. Agarwal
9-25 వాద్య సంగీతం†
9-30 కల్యాణదర్శన: నాటిక
రేడియో అనుసరణ:
వసంత్ కవాలి
10-30 ఆంగ్లములో వార్తలు
10-35 వాతావరణ సూచన
జనగణమన ప్రసారసమాప్తి

# మంగళవారం ఏప్రిల్ 30

శక 1890 వైశాఖ 10

## హైదరాబాద్-ఎ

405.4 మీ (740 కిలోసై)

62.50 మీ (4800 కిలోసై)

ఉ॥ 6-30 నుండి 7-45 వరకు

42.02 మీ (7140 కిలోసై)

ఉ॥ 8-00 నుండి 8-30 వరకు

30.86 మీ (9720 కిలోసై)

మ॥ 11-45 నుండి 12-05 వరకు

మ॥ 12-30 నుండి సా॥ 2-30 వరకు

62.50 మీ (4800 కిలోసై)

సా॥ 5-55 నుండి రా॥ 10-40 వరకు

ఉ॥ ప్రసారము I

6-30* వందేమాతరం, మంగళధ్వని కార్యక్రమ వివరణ
6-40 ఆంగ్లములో వార్తలు
6-45 భక్తిరంజని
7-00 తెలుగులో వార్తలు
7-15 విజయవాడ వలె
7-45 సంకీర్తనం
7-55 సూక్తిముక్తావళి
8-00 ఆంగ్లములో వార్తలు
8-15 హిందీలో వార్తలు
8-30 వాద్యగోష్ఠి: నిలయవిద్వాంసులు
9-00* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12-30* కార్మికుల కార్యక్రమము
1-00 వనితావాణి (విజయవాడనుండి రిలే)
1-30 ఆంగ్లములో వార్తలు
1-40 చిత్రసీమ†
1-50 తెలుగులో వార్తలు
2-00 వాతావరణ సూచన ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

5-55 స్థానిక ప్రకటనలు
6-00 ఆంగ్లములో వార్తలు
6-05 ప్రాంతీయ వార్తలు
6-15 ప్రాంతీయ వార్తలు (ఉర్దూ) [హైదరాబాద్, కడపలు మాత్రమే]
6-25 ముఖ్య ప్రకటనలు, విరామ సంగీతం
6-30 గ్రామస్థుల రేడియోగోష్ఠి
ప్రత్యుత్తర వేదిక
రైతాంగము-సేద్య సహకార సంఘాలు
సంభాషణ
ధరలు, వాతావరణము
7-00 తెలుగులో వార్తలు
7-15 పద్య పఠనము
7-30 చిత్రసీమ†
7-45 రేడియో వార్తావాహిని
8-00 మీరుకోరిన పాటలు†
8-30 తేనె జిల్లు రూపకం
8-5 Today in Parliament
9-00 ఆంగ్లములో వార్తలు
9-15 ఢిల్లీనుండి రిలే
9-30 విజయవాడవలె
10-30 ఆంగ్లములో వార్తలు
10-35 హిందీలో వార్తలు
10-40 వాతావరణ సూచన, జనగణమన, ప్రసార సమాప్తి

## కడప

333.3 మీ (900 కిలోసై)

సా॥ 5-55 నుండి రా॥ 10-40 వరకు

శనివారము మాత్రము

సా॥ 5-55 నుండి రా॥ 11-10 వరకు

## విశాఖపట్నం

322.6 మీ (930 కిలోసై)

సా॥ 5-55 నుండి రా॥ 10-40 వరకు

## విజయవాడ

357.1 మీ (840 కిలోసై)

ఉ॥ ప్రసారము I

6-00* వందేమాతరం, శుభోదయం ప్రసార విశేషాలు
6-10 భక్తిరంజని: తరంగములు, భజనలు
6-40 ఆంగ్లములో వార్తలు
6-45 సూక్తిముక్తావళి
6-50 వాద్య సంగీతం
7-00 తెలుగులో వార్తలు
7-15 ప్రపంచం సీతారాం: వేణువు
7-45 సంగీత శిక్షణ (జూనియర్లకు)
8-00 ఆంగ్లములో వార్తలు
8-15 హిందీలో వార్తలు
8-30* ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12-30* కార్మికుల కార్యక్రమము (హైదరాబాద్ నుండి రిలే)
1-00 వనితావాణి
స్త్రీల కార్యక్రమము
పాట
సీతమ్మగారి సలహాలు
చర్చ
రచన: కాకుటూరు పద్మావతి
వార్తావళి, మంగళం

## హైదరాబాద్-బి

283 మీ (1060 కిలోసై)

మ॥ ప్రసారము I

2-00* సుబద్ధ సంగీత్ సతీశ్ కుమార్
2-10 ఉర్దూలో వార్తలు
2-30 సుబద్ధ సంగీత్† సతీశ్ కుమార్
2-30 స్త్రీల కార్యక్రమము (హిందీ)
3-00* ప్రసార సమాప్తి

రా॥ ప్రసారము II

7-30* అంబాదాస్ ఆప్తే: ఖయాల్
8-00* మరాఠీ శ్రోతలకు
8-30 Radio News Reel (relay from Delhi)
8-40 అంబాదాస్ ఆప్తే: ఖయాల్
9-00 చిత్రపట్ సేత్†
9-15 ఉర్దూలో వార్తలు
9-30 ఉర్దూలో కార్యక్రమము
10-00 జనగణమన, ప్రసార సమాప్తి

## హైదరాబాద్-సి

245.9 మీ (1220 కిలోసై)

వివిధభారతి (రిలే)

(వివరాలు 48-వ పేజీలో)

1-30 ఆంగ్లములో వార్తలు
1-40 హిందీలో వార్తలు
1-50 తెలుగులో వార్తలు
2-00 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

5-55* స్థానిక ప్రకటనలు
6-00 ఆంగ్లములో వార్తలు
6-05 ప్రాంతీయ వార్తలు
6-15 పురాణ కాలక్షేపం (భారతమునుండి)
6-30 చిత్రతరంగిణి- ఫిల్మ్ సంగీతం†
7-00 తెలుగులో వార్తలు
7-15 పంటసీమలు
గ్రామీణ రేడియోగోష్ఠి
ప్రశ్నలూ జవాబులు
మాగాణి పేరుశెనగ రకాల అనుభవము
మార్కెట్టు ధరలు
వాతావరణము
7-45 రేడియో వార్తావాహిని (హైదరాబాద్ నుండి రిలే)
8-00 లలిత సంగీతం: సుధా భరద్వాజ
8-15 What is wrong with our Customs? discussion
Participants:
Parvati Srinivasan
Patibanda SundarRao
P. Vijaya Rao
8-30 ఢిల్లీనుండి రిలే
8-40 ప్రాదేశిక సుగమ సంగీత్†
8-50 Today in Parliament
9-00 ఆంగ్లములో వార్తలు
9-15 ఢిల్లీనుండి రిలే
9-30 రుక్మిణీ కల్యాణం
మెలట్టూర్ సంగీత నాటిక
రచన: మెలట్టూర్ వెంకటరామశాస్త్రి
సంప్రదాయ సంగీతం: బాలు భాగవతర్
10-30 ఆంగ్లములో వార్తలు
10-35 జనగణమన, ప్రసార సమాప్తి

## విజయవాడ-బి

200 మీ (1500 కిలోసై)

వివిధభారతి (రిలే)

(వివరాలు 48-వ పేజీలో)



* సమయ సూచన   † గ్రామఫోన్ రికార్డ్   ¶ స్టూడియో రికార్డింగ్

## మంగళవారం ఏప్రిల్ 30

శక 1890 వైశాఖ 10

# మద్రాస్-ఎ

60.98 మీ (4920 కిలోస్పై)
ఉ॥ 6-30 నుండి 9-15 వరకు
31.28 మీ (9590 కిలోస్పై)
మ॥ 11-55 నుండి సా॥ 2-10 వరకు
60.98 మీ (4920 కిలోస్పై)
సా॥ 6-05 నుండి రా॥ 11-00 వరకు

ఉ॥ ప్రసారము I

6-00* వందేమాతరం, మంగళగానం
6-05 తుదిప్పాడల్‌గళ్
6-30 నేటి కార్యక్రమ వివరణ, వాతావరణ సూచన
6-35 అరుళ్ వాక్కు
6-40 ఆంగ్లములో వార్తలు
6-45 సంగీతామృతం:
7-15 తమిళములో వార్తలు
7-30 హజరత్ నఫర్‌వెలి దర్గ రూపకం (తమిళము)
8-00 వాద్యగోష్ఠి
8-15 సంపుకాల అక్కిముత్తై ప్రసంగం కె. అన్బళగన్
8-30 వాద్య సంగీతం
8-45 గీతమంజరి
9-15 కౌసల్యా రామకృష్ణారెడ్డి: వీణ
9. 5 రాజం పుష్పవనం: గాత్రం
0-30 మధురగీతం
0. 5 ఆంగ్లములో వార్తలు
1-00 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

1-55 ప్రాంతీయ కొయిదిగళ్
2-00* కార్మికుల కార్యక్రమము
2-30 ఎస్. నటరాజన్: గాత్రం
1-00 స్త్రీలకు (తమిళం)
1-30 వాద్యగోష్ఠి
1-45 చిత్రగానం†
1-55 వాతావరణ సూచన
2-00 తమిళములో వార్తలు
2-10 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

5-30* కౌసల్యా రామకృష్ణారెడ్డి: వీణ
6-00 విరామ సంగీతం
6-05 ప్రాంతీయ కొయిదిగళ్
6-15 కార్యక్రమ వివరణ, వాణిజ్య వార్తలు, ప్రత్యేక ప్రకటనలు, వాతావరణ సూచన
6-30 వాద్య సంగీతం: వీణ, కోటువాద్యం
6-45 చిత్రగానం†
7-15 తమిళములో వార్తలు
7-30 వ్యావసాయదారులకు (తిరుచ్చినుండి రిలే)
8-00 అణుశక్తియిన్ అరుంపయన్: తొళిల్ తుఱయిల్ ప్రసంగం టి. ఎస్. గోవిందరాజన్
8-10 విరామ సంగీతం
8-15 జనతా నగర్ సీరియల్ నాటిక రచన: ఎమ్. ఎస్. పెరుమాళ్
8-45 మెల్లిశై:
9-00 ఆంగ్లములో వార్తలు
10-30 గీతమాలిక
11-00 జనగణమన, ప్రసార సమాప్తి

# మద్రాస్-బి

211.3 మీ (1420 కిలోస్పై)

ఉ॥ ప్రసారము I

6-57 వందేమాతరం, మంగళధ్వని
7-00 తెలుగులో వార్తలు
7-15 సంగీత మంజరి† కందర్ అనుభూతి, కృపానంద వారియార్
7-30 వసంతా గోపాలకృష్ణన్
8-00 ఆంగ్లములో వార్తలు
8-15 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

211.3 మీ (1420 కిలోస్పై)

1-00 Western music: Excerpts from 'Dido and Aeneas' by Purcell
1-30 ఆంగ్లములో వార్తలు
1-40 హిందీలో వార్తలు
1-50 తెలుగులో వార్తలు
2-00 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

211.3 మీ (1420 కిలోస్పై)
(5-30 నుండి 6-05 వరకు 60.98 మీటర్లపైగూడా)

5-30* Western music: Alberto Lysy (Violin)
6-00 ఆంగ్లములో వార్తలు
6-05 మద్రాస్ ఎ రిలే
6-30 ప్రసిద్ధ కవులు: మంచన ప్రసంగం వె. పద్మనాభస్వామి లలిత సంగీతం
7-00 తెలుగులో వార్తలు
7-15 సంగీతమంజరి† ఎ. కె. సి. నటరాజన్: క్లారినెట్
7-30 చిత్రగానం† పందయం వినైవిల్ నిండ్రవళ్ కర్పూరం పట్టణత్తిల్ భూతం నెంజిరుక్కుంవరై పెన్‌పెండ్రాళ్ పెణ్ కందన్ కరుణై ఇదయ కమలం
8-00 ఎస్. నటరాజన్: గాత్రం
8-30 Radio News Reel (relay from Delhi)
8-45 విరామ సంగీతం
8-50 Today in Parliament
9-00 ఆంగ్లములో వార్తలు
9-15 ఢిల్లీనుండి రిలే
9-30 Western music A Jug of Punch Semprini (Pianoforte)
10-30 ఆంగ్లములో వార్తలు
10-35 వాతావరణ సూచన, జనగణమన, ప్రసార సమాప్తి

# మద్రాస్-సి

193.5 మీ (1550 కిలోస్పై)
వివిధభారతి (రిలే)
(వివరాలు 44-వ పేజీలో)

# బెంగుళూరు

ఉ॥ ప్రసారము I

6-30* వందేమాతరం, మంగళధ్వని
6-40 ఆంగ్లములో వార్తలు
6-45 కార్యక్రమ వివరణ
6-50 గీతారాధన
7-15 ఎస్. జయలక్ష్మి: గాత్రం
7-45 కన్నడములో వార్తలు
8-00 ఆంగ్లములో వార్తలు
8-15 ఎమ్. ప్రభాకర్: దేవరనామ
8-30* ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12-30* వనితావిహార
1-10 కన్నడములో వార్తలు
1-20 ఎ. ఎస్. శ్రీనివాసమూర్తి: కన్నడగీతె
1-30 ఆంగ్లములో వార్తలు
1-40 హిందీలో వార్తలు
1-50 ఎ. ఎస్. శ్రీనివాసమూర్తి: కన్నడగీతె
2-00 వాతావరణ సూచన. ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

5-30* కార్మికుల కార్యక్రమము
6-00 ఆంగ్లములో వార్తలు
6-05 స్థానిక ప్రకటనలు
6-10 వేణువు†
6-15 మానెయమాతు
6-25 గురురావ్ దేశపాండే: తండవ్వల గీతాలు
6-35 ప్రదేశ సమాచార
6-45 చిత్రగీతె†
7-00 గ్రామస్థులకు
7-45 కన్నడములో వార్తలు
8-00 బసవ సందేశ ప్రసంగం ఎస్. ఆర్. కాంతి
8-10 వాద్యశ్రీ†
8 15 మల్లికార్జున మన్సూర్: వచనములు
8-30 ఢిల్లీనుండి రిలే
8-40 వాద్యశ్రీ†
8-45 నవనుమ: శ్రీ. ఎస్. ఇందిర
8-50 Today in Parliament
9-00 ఆంగ్లములో వార్తలు
9-15 సమాచార దర్శన
9-25 వాద్య సంగీత†
9-30 సిద్ధారాం జంబల్ దిన్ని: నామామృత
9-45 టి. వరదరాజ అయ్యంగార్: రాగం, తానం, పల్లవి
10-30 ఆంగ్లములో వార్తలు
10-35 జనగణమన, ప్రసార సమాప్తి

* రేడియో సూచన † గ్రామఫోన్ రికార్డ్ ‡ స్టూడియో రికార్డింగ్

# ప్రసంగములు

### హైదరాబాద్

ఏప్రిల్ 26 శు రాం 8-00 ప్రథమాంధ్ర పంచతంత్రం
ప్రసంగం
కె. శివరామకృష్ణశాస్త్రి

,, 27 శ॥ రా॥ 8-10 పాల ప్రాజెక్టు-లక్ష్యసిద్ధి
భవిష్యత్ ప్రణాళిక
ప్రసంగం

పశుగ్రాసము-అభివృద్ధి
ప్రసంగం

,, 28 ఆ॥ రా॥ 8-10 ఆంధ్రప్రదేశ్‌లో పొదుపు ఉద్యమం
ప్రసంగం

జాతీయసమైక్యత
ప్రసంగం

### విజయవాడ

ఏప్రిల్ 21 ఆ॥ రా॥ 8 15 జాతీయాభ్యుదయం-యువజనుల పాత్ర-ఆదర్శాలు
ప్రసంగం
కె. కోటీశ్వరరావు

,, 23 మం॥ రా॥ 8-15 పరిణామ సిద్ధాంతము-పూర్వాపరాలు
ప్రసంగం
డా॥ పి. దక్షిణామూర్తి

### మద్రాసు

ఏప్రిల్ 16 మం॥ సా॥ 6-30 వచన రచనా భగీరథులు
ప్రసంగం
టి. చిన్నికృష్ణయ్య

30 మం॥ రా॥ 8.30 ప్రసిద్ధ కవులు-మంచన
ప్రసంగం
వై. పద్మనాభస్వామి

# నాటికలు, రూపకములు

### హైదరాబాద్

ఏప్రిల్ 22 సో॥ రా॥ 9-30 హంతకులు నాటిక
రచన: పి. సాంబశివరావు

,, 24 బు॥ రా॥ 8-00 కవిసార్వభౌముడు రూపకం
రచన: జి. వి. సుబ్రహ్మణ్యం

,, 28 ఆ॥ మ॥ 1-00 హైదరాబాద్‌లో బొమ్మల తయారీ
రూపకం
సమర్పణ: కామేశ్వరి

,, 30 మం॥ రా॥ 8-30 తేనెజల్లు రూపకం

### విజయవాడ

ఏప్రిల్ 17 బు॥ రా॥ 8-00 అడుగు జాడలు నాటిక

,, 20 శ॥ రా॥ 7 45 మత్తు పిల్ల నాటిక
రచన: ఎమ్. ఎత్తిరాజాచార్యులు

,, 21 ఆ॥ రా॥ 7-45 గోష్పద పుణ్యాల స్థలనిర్ణయ డాక్యుమెంటరీ రూపకం
రచన: జి. సత్యనారాయణ

### మద్రాసు

ఏప్రిల్ 21 ఆ॥ మ॥ 2-00 లకుమాదేవి నాటిక
రచన: రేపనూరి శమంత

,, 28 ఆ॥ మ॥ 2-00 కాలసంధ్య
అఖిల భారత నాటకము

# సంగీత కచేరీలు

### హైదరాబాద్

| | | | | |
|---|---|---|---|---|
| ఏప్రిల్ 19 | శు॥ | రా॥ | 9-30 | ఎస్. సిహెచ్. సత్యనారాయణ: గాత్రం<br>నేతి శ్రీరామ శర్మ: వయొలిన్<br>వి. ఎస్. లక్ష్మీనారాయణన్: మృదంగం |
| ,, 21 | ఆ॥ | ఉ॥ | 8-30 | గోనపీడు పెక్వాసక హెూహెట్ బృందం: నాదస్వరం |
| ,, 25 | గు॥ | రా॥ | 7-45 | రాగం, తానం, పల్లవి:<br>పప్పు సోమేశ్వర రావు: వీణ<br>వి. ఎస్. లక్ష్మీనారాయణన్: మృదంగం |
| ,, 28 | ఆ॥ | ఉ॥ | 8-30 | రామ్ప్రసాద్ కృష్ణన్: గాత్రం |

### విజయవాడ

| | | | | |
|---|---|---|---|---|
| ఏప్రిల్ 16 | మం॥ | రా॥ | 9-30 | పుల్లెల పేరిసోమయాజులు: వయొలిన్<br>కె. హనుమంతరావు: మృదంగం |
| ,, 19 | గు॥ | రా॥ | 7-45 | రాగం తానం, పల్లవి<br>ఎస్. ఆర్. జానకిరామన్: గాత్రం<br>డి పాండురంగరాజు: వయొలిన్<br>జె. సింహాచలశాస్త్రి; మృదంగం |
| ,, 26 | శు॥ | రా॥ | 9-30 | ఎమ్. ఎస్. బాలసుబ్రహ్మణ్యశర్మ గాత్రం<br>అన్నవరపు రామస్వామి: వయొలిన్<br>దండమూడి రామమోహనరావు: మృదంగం<br>అన్నవరపు గోపాలం: ఘటం |

### మద్రాస్

| | | | | |
|---|---|---|---|---|
| ఏప్రిల్ 8 | గు॥ | రా॥ | 9-30 | జానకీ సుబ్రహ్మణ్యం: గాత్రం |
| ,, 19 | శు॥ | రా॥ | 9-15 | ఎమ్. ఎస్. గోపాలకృష్ణన్: వయొలిన్<br>వి. ఎస్. మురుగభూపతి:మృదంగం |
| ,, 20 | శ॥ | ఉ॥ | 8-00 | ఎ. ఆర్ సుందరం: గాత్రం |
| ,, 21 | ఆ॥ | సా॥ | 4-30 | వైరమంగళం లక్ష్మీనారాయణన్: గాత్రం<br>తిరుచ్చి బాలసుబ్రహ్మణ్యం: వయొలిన్<br>మద్రాస్ ఎ. కన్నన్: మృదంగం |
| ,, 22 | సో॥ | రా॥ | 9-45 | రాగం, తానం, పల్లవి:<br>ఆర్. పిచ్చుమణి: వీణ<br>కోయంబత్తూర్ ఎస్. రామస్వామి: మృదంగం |

### మద్రాస్

| | | | | |
|---|---|---|---|---|
| ,, 25 | గు॥ | రా॥ | 8-00 | టి. ఎమ్. సౌందరరాజన్: గాత్రం<br>జె రామయ్య: వయొలిన్<br>మదురై కె ఎస్ చెల్లప్ప: మృదంగం<br>పాల్ఘాట్ వి. ఎ సుందరం: ఘటం |
| ,, 26 | శు | ఉ॥ | 8-00 | రాగం. తానం, పల్లవి:<br>టి. విశ్వనాధన్: వేణువు |
| ,, 27 | శ॥ | ఉ॥ | 8-00 | టి. కె. రాధాకృష్ణన్: వేణువు<br>చిత్తూర్ గోపాలకృష్ణన్: వయొలిన్<br>పాల్ఘాట్ కె. కుంజుమణి: మృదంగం<br>ఆర్. ఎస్ కృష్ణమూర్తిరావు ఘటం |
| ,, 8 | ఆ॥ | ఉ॥ | 8-15 | ఎన్. ఎల్ గానసరస్వతి: గాత్రం<br>ఆర్. ఎస్ గోపాలకృష్ణన్ వయొలిన్<br>పాల్ఘాట్ కె. కుంజుమణి మృదంగం<br>ఆర్. ఎస్ కృష్ణమూర్తిరావు:ఘటం |
| ,, 29 | సో॥ | రా | 9-45 | రాగం. తానం. పల్లవి<br>డి. కె. జయరామన్: గాత్రం<br>వి. ఎల్. వేదగిరి: వయొలిన్<br>పాల్ఘాట్ కె. కుంజుమణి:మృదంగం |

### బెంగళూరు

| | | | | |
|---|---|---|---|---|
| ఏప్రిల్ 18 | మం॥ | రా॥ | 9-30 | ఎమ్ ఎల్. వసంతకుమారి గాత్రం |
| ,, 21 | ఆ॥ | ఉ॥ | 8-30 | వి. దేశికాచార్: వేణువు<br>ఎస్ మహాదేవప్ప: వయొలిన్<br>టి. కె. వయ్యాపురిదేవరు: మృదంగం |
| ,, 28 | ఆ॥ | ఉ॥ | 8-30 | ఎమ్. శేషగిరి ఆచార్: గాత్రం<br>జె. ఎల్ కాశీనాధశాస్త్రి: వయొలిన్<br>కె ఎస్, గోపాలరావు: మృదంగం<br>ఎన్. శేషగిరిదాస్ కంజీర |

### తిరుచ్చి

| | | | | |
|---|---|---|---|---|
| ఏప్రిల్ 21 | ఆ॥ | ఉ॥ | 8-15 | తిరురామేశ్వరం టి. ఆర్. మీనాక్షిసుందరం<br>టి. ఆర్. కృష్ణమూర్తి; నాదస్వరం |
| ,, 23 | మం॥ | రా॥ | 9-15 | కురిక్కురై ఎస్. పిచ్చైయప్పన్: నాదస్వరం<br>తిరుచ్చేరై జి. ముత్తుకుమారస్వామి: డోలు |
| ,, 28 | ఆ॥ | సా॥ | 4-30 | శ్రీవంజియం రామచంద్ర అయ్యర్: గాత్రం |

## నుడి - నానుడి

(5వ పేజీ తరువాయి)

రూఢమై స్నానసామాన్యార్థం వ్యవహారంనుండి భ్రష్టమైంది. నేడు ఎవరైనా స్నానంచేసి వస్తాను. నీళ్ళుపోసుకొని వస్తాను అనడానికి మారు నీళ్ళాడి వస్తాను అంటే నవ్వులపాలవుతారు.

స్నానమనే అర్థంబట్టి నీరాటరేవు అనే ప్రయోగం వచ్చింది. ఇది నేడు నీలాటిరేవు అని స్నానఘట్టానికి రూఢమయింది.

పశుప్రాణులతో పోల్పులనుబట్టి ఏర్పడే పదబంధాలు, పలుకుబళ్ళు విచిత్రంగా వుంటాయి. పొట్టేలు, పెద్దదై, బలిసినకొద్దీ దాని కొమ్ములు వంపులు తిరుగుతూ పోతాయి. ఎవరో పట్టుకుని మెలిపెట్టినట్టు మకొన్నిటికి కొమ్ములు ముదురుతూ వస్తాయి. ఎన్ని ఈతలో తెలుసుకోడానికి కొమ్ములమెలికలు పరిశీలిస్తారు. ఈ కొమ్ములు వికాసం ఇతరత్రా అభివృద్ధిని, బలాన్ని, అతిశయాన్ని తెలియజేయడానికీ ప్రయుక్తమౌతూ వచ్చింది కొమ్ములు తిరిగిన పండితుడు, సుమంటీ అయ్య- ఇత్యాదిగా.

ఇతర భాషల ప్రభావంవల్ల ఏర్పడే నానుడులు మరింత వింతగా వుంటాయి. మనకు లబ్బుగా, ముక్తసరిగా, భేషుగ్గా మొదలయిన నానుడులు వచ్చాయి భయపడేవాణ్ణి చూచి గుండెలులేనివాడు అనే నానుడి వుంది గదా, దానినిబట్టి దమ్ములేనివాడు అనే పరభాషా పదంతో నానుడులు ఏర్పడ్డాయి. దమ్ అంటే ఊపిరి. కాని, తెలుగులో ఈ దమ్ ఊపిరితో ఆగలేదు. ఊపిరితోపాటు గుండెలు, ధైర్యం మొదలయిన అర్థాలుతెచ్చుకొని, దొమ్మదొమ్ములు దమ్ములు గుండెలులాగ అనేక రూపాలుకూడా తీర్చుకుంది. సన్నని నడుము, వెడద రొమ్ము అంగసౌష్ఠవం ప్రధాన లక్షణాలు. వెడదరొమ్ముల వాళ్ళంతా వీరులని, నిర్భీకులనికాదు. అదొక నమ్మకం దీనినిబట్టి చిన్న రొమ్ము పిరికికి సూచకమయి, సందెడు దొమ్ములు—సంచిట్లో ఇమిడే దొమ్ములు—అనే పలుకుబడి వచ్చింది. పిరికివాణ్ణి అనడానికి.

కొన్ని వస్తువులు విదేశాలనుంచి వచ్చి మన జీవితంలో రంగరించుకొని పోయి, అవి మన పదాలక్షణంగాను మారిపోయే పరిస్థితి వస్తుంది. అలాంటి వస్తువు మిరపకాయ. ఈ మిరపకాయ రాకముందు కారానికి అవ, మిరియాలు, పిప్పళ్ళు కొంత వాడేవారు.

మిరియము సుల్లియుం బసపు
 మెంతియు నింగువ జీలకఱ్ఱయుం
గొత్తిమిరయును జింతపండును గ
 రంబును గమ్మని నేయి తైలముల్
చెరుగును మేళవించి కడు
 జెక్కు విధంబుల బాకశుద్ధి వం
డిరి శిరియాళుపిం గతికె
 డెందమును దరళాక్షులిద్దరున్.

అని చిరుతొండని వంపి వండడం వర్ణించాడు శ్రీనాథుడు హరవిలాసంలో.

మిరియం మనకు ప్రాచీనంగా వుంది. దానినిబట్టి కారంగా వుంటే ఈ కాయను మిరపకాయ అన్నారు. ఇది అమెరికాది. దీనిని పోర్చుగీసువారు వెస్టిండీస్ నుంచి తమ దేశానికి, అక్కడినుంచి మనదేశానికి తెచ్చారని చరిత్రకారులు తెలుపుతున్నారు. ఇది దాదాపు రెండువందల సంవత్సరాలకు ముందు మనదేశానికి వచ్చింది. పీటినే బొంబాయి రాష్ట్రంలో 1780 ప్రాంతంలో పండించారుట. అంతకుముందు దీనిని గోవలో పండించేవారు గనుక దీనికి మరాఠీలో గోవాయిమిర్చి అనే వ్యవహారం ఏర్పడింది.

ఈ మిరపకాయ గుణం, ఆకారం బట్టి రకరకాల నానుడులు పుట్టాయి—పచ్చిమిరపకాయ సుమండీ వాడు. పొట్టివాడయినా సూదిమిరపకాయ వంటివాడని. లోపల క్షారంలేనివాడిని బుంగమిరపకాయ అని వ్యవహరించడం పరిపాటి అయింది

బ్రౌను తన నిఘంటువులో మిరపకాయ మిరెపుకాయ, మిరియపుకాయ అనే రూపాలిచ్చి, సూదిమిరపకాయ గోలకొండ మిరపకాయ, సీమమిరపకాయ మొదలయిన భేదాలు తెలిపాడు

ఈ మిరియపుకాయ తెలుగువారి ఉద్రేకానికి ప్రతీక అయి. జాతి లక్షణంగానూ పరిణమించింది

ఇంతకుముందు చదివిన శ్రీనాథుని వర్ణనలో మనకు లవంగం సంస్కృతపదమనే నమ్మకం కలుగుతుంది కాని ఇది సంస్కృతపదం కాదు. ఇది మన ప్రాచీన వైద్యగ్రంథాలలో కనిపిస్తుంది. అమరంలో లేదు.

లవంగం దేవకుసుమం శ్రీసంజ్ఞం అని పేర్కొన్నాడు. లవంగం అనే పదానికి లూనాతి శ్లేష్మాదికమితి లూ ఙ్ఛన్ తరత్యాదిభ్యశ్చ 'ఉణాది' ఇతి అంగచ్ అని దీనికి మన వైయాకరణులు అర్థం చెబుతారు. కాని ఇది దేవకుసుమం అనే పర్యాయపదంలో మన దేశంది కాదని గ్రహించవచ్చు. మనకు వింతైనది అపూర్వమైనదీ అంతా దైవతమే. కనుక దీనికి దేవకుసుమం అన్నారనడం స్పష్టం.

కాని కాళిదాసు - ద్వీపాంతరానీత లవంగ పుష్పైః—అని రఘువంశంలో ద్వీపాంతరమునుండి తెచ్చిన లవంగ పుష్పాలన్నాడు. మనకు సుగంధద్రవ్యాలు చాలవరకు ఆగ్నేయాసియా దేశాలనుంచి వచ్చాయి. అక్కడి మాటలు లంగ్‌లంగ్‌లంగ్, లాంగ్‌వంగ్ వివాచేరి లవంగమై వుంటుందని నానమ్మకం. పూర్వపు సంస్కృత భాషావేత్తలు కావలసినన్ని విదేశపదాలను గ్రహించి సంస్కృతీకరించుకొనే ఔదార్యం కలవారు ఇప్పటివారిలాగ మడిగట్టుకొని కూర్చోలేదు.

నేడు మానవుని పరిధి అతి విస్తృతం. నూతనోపకరణాలు, యంత్రాలు మొదలయినవాటి ఆవిర్భావంతో ప్రతిభాషలోను వివిధవిధాలయిన నుడులూ, నానుడులూ వెలుస్తున్నాయి. భాషాభాండారం నిండారుతున్నది. మానవుని భావన అమరం, అజరామరం.

---



కడలూర్ సుబ్రహ్మణ్యం: గాత్రం (మద్రాస్, ఏప్రిల్ 19)

# గజల్

కోష్ మల్సియానీ ఉర్దూ గజల్‌కు దాశరథి అనువాదం.

అవని సృష్టికి ఆది యెచటో అంతమెచటో తెలియదు
నేను యెచ్చటినుండి వచ్చితి యెచటికేగుదు, తెలియదు

దేవునికె తెలియాలి అందరు దైవభక్తులు అందరు
ఈ ప్రపంచపు ఉనికి యెందుకో యెవ్వరికినీ తెలియదు

సుందరీ ముఖబింబమున ముసుగెందుకో నే నెరుగుదు
అంతకంటే ఇతర వేదాంతాంశమేదీ తెలియదు

నాకు వేదన నెవ్వడిడెనో, అతడు శత్రువో మిత్రుడో
దీని వాస్తవమేమిటో ఈనాటికైనా తెలియదు

తనను గూర్చి తానెయించుక తెలిసికొనలేడాయెనే
అట్టితరి ఇంకొకరిగూరిచి యెట్లు తెలియును? తెలియదు

అడుగు అడుగుకు గడప గడపకు ఆగిపోయే నడకతో
యెంతదూరం యెంతకాలం యెవడు నడుచునో? తెలియదు

బ్రతుకు బంధమునుంచి విడివడి స్వతంత్రత చేకూరినా
మనము చేసిన నేరమేమో మనకు మాత్రం తెలియదు

ఎన్ని కొలమానములు గలిగిన యేమి లాభం లేదులే
ఎవ్వనికినీ తనదు గమ్యం యెంతదూరమో తెలియదు

నాకు మృత్యువుపైననే విశ్వాస మున్నది, ఓ కవీ
నాడు రుగ్మతలను తుదుర్చుట మృత్యువునకే తెలియును.

---



శీర్కాళి గోవిందరాజన్, మెల్లసై (మద్రాస్, ఏప్రిల్ 20)

# ప్రకృతి

శ్రీ ముడియరశన్ తమిళమూలానికి చల్లా రాధాకృష్ణశర్మ తెలుగుసేత.

పశ్చిమాద్రికి పయనమైన పగటి వేల్పు
సంజకెంజాయలు తనలో కరిగిపోగా
వింతరంగు లెన్నో సంతరించుకుని
పొలాలను పలుకరిస్తూ
కొలవల్లో విహరిస్తూ
గాలి తాకిడికి మువ్వల సవ్వడి చేస్తూ
ప్రవహిస్తోంది తరుగిణి.

తరంగహస్తాలలో తలదువ్వుకున్నట్టు
రేగడిమట్టి తీరము చేరగా
తెల్లని పల్వాసను తలపించే
మరుగు గప్పిన శంఖాలు ఒడ్డుకి కొట్టుకురాగా
వెడదకన్నులు స్ఫురింపజేసే
మీనము లెన్నో మిలమిల లాడగా
కెందమ్మి కరమైన కారణాన
వంచిన శిరసును పైకెత్తకుండా
వడివడిగా ప్రవహిస్తోంది తరంగిణి
కడలి కడుపులో తలదాచుకోవాలని.

కమ్మతెమ్మెరల డోలికలో నన్ను పడుంకబెట్టి
మధువుకోసం పూలచుట్టూ చేరి
భృంగతతి ఆలపించే తమిళ గీతికలతో
నాకు జోల పాడుతుంది;
నిద్రలో లేచినప్పుడు
ప్రవహించే సరిత్తునీ
కొండనుండి జారే జలపాతాన్నీ
అలరుల్నీ అర్ణవాన్నీ చూపి
నిద్రబుచ్చుతుంది. నా జనని.

కరకర తెల్లవారినా-నిద్రిస్తున్న నన్ను చూడగానే
ఆమె ముఖం ఎడుపెక్కుతుంది-ఆమె మాటలో కటుత్వం
కనిపిస్తుంది
కిరణహస్తాలతో నన్ను లేపుతుంది-అప్పుడు నాలో
విసుగు కనిపించినా
ఆమె ముఖంలో కనిపించదు కోపం-ప్రేమతో పలుకరిస్తుంది
తమిళలో
అగ్రహించినా అనుగ్రహించే-ఆర్ద్రహృదయం మజ్జననిది.

## మహాత్మాగాంధి

2(వ పేజీ తరువాయి)

జిన్నా మాత్రం ఈపద్ధతిని అంగీకరించలేకపోయాడు. ఆయన మహాత్మునినుంచి విడిపోయినది హిందూ ముస్లిం సమస్యమీద కాదు. సామాన్యప్రజల మధ్య వారితో సమానంగా నాయకులు సంచరించే యీగాంధీయ పద్ధతి ఆయనకు రుచించలేదు. రాజకీయాలంటే ఆయనభావం వేరు. శాసన సభలలో, చర్చావేదికలలో, విద్వద్గోష్ఠులలో ఉన్నతస్థాయి చర్చలకు రాజకీయాలు పరిమితం కావాలనే భావం ఆయనది. ఈ కొత్త సంప్రదాయంలో ఆయన ఇమడలేకపోయాడు. మిగతా నాయకులంతా మహాత్ముని పద్ధతులన్నిటిలో ఏకీభవించలేక పోయినా ఆయన నాయకత్వాన్ని, ఆందలి నవీనత్వాన్ని గుర్తించి అంగీకరించారు.

స్వాతంత్ర్యోద్యమము సాగించవలసింది గ్రామసీమలలో నని ఆయన కార్యకర్తలకు ప్రబోధించారు. వారిని గ్రామాలకు పంపారు. సామాన్యప్రజలకంటె తాము అధికులమనుకొనేభావం నాయకులలోనూ చదువుకున్నవారిలోనూ తొలగించాడాయన. ఇందువల్ల రెండు ప్రయోజనాలు చేకూరాయి. ప్రజలందరిలో అభయభావం వ్యాపింప ప్రారంభించింది. నాయకులు దేశ పజల యదార్థస్థితిగతులను స్వయంగా చూచి తెలుసుకొనే అవకాశం లభించింది. ప్రజలకు ఏమికావాలో, నగరాలలో కూర్చుని విద్వద్గోష్ఠులలో చర్చించి నిర్ణయించే పద్ధతులు పోయి, ప్రజలమధ్యకు వెళ్ళి తెలుసుకునే నూతన సంప్రదాయం నెలకొన్నది భారత స్వాతంత్ర్య ఉద్యమం తోపాటే దేశంలో ఆర్థిక, సాంఘిక స్వాతంత్ర్యానికి బలమైన పునాదిని నిర్మించటానికి తోడ్పడిందిది. రైతు కూలీ ప్రజానీకంలో జాతీయ చైతన్యస్రవంతిని సృష్టించింది. స్వాతంత్ర్య ఉద్యమం ప్రజల ఉద్యమం అయింది.

ఈ విధంగా భూమికను తయారుచేసుకొని మహాత్ముడు బ్రిటిషు ప్రభుత్వంమీద సాత్వికయుద్ధం ప్రకటించాడు. దానికి సత్యాగ్రహమని పేరు పెట్టారు

### ప్రజల ఉద్యమము

పట్టు విడుపులతో ఎదుటివారిలో పట్టు సడలింపజేసే బ్రిటిషు వారి సంప్రదాయాన్నే మహాత్ముడు వారిమీద ప్రయోగించి వారిని జయించగలిగాడు. 1915 లో మద్రాసునగరంలో గాంధీ మహాత్ముడు చేసిన బహిరంగ ఉపన్యాసంలో బ్రిటిషువారి మంచితనాన్ని, వివేకాన్ని ఆయన ప్రశంసించిన తీరు ఆనాటి శ్రోతలను విస్తుపరిచింది. అదే ఆయన భారత దేశంలో చేసిన మొట్టమొదటి బహిరంగ రాజకీయ ప్రసంగం. అది విన్నవారు యీయన రాజును మించిన రాజభక్తుడన్నారు. భారత స్వాతంత్ర్యానికి వ్యతిరేకి అన్నారు. కాని, ఆయన ప్రారంభించనున్న ధర్మయుద్ధంలో అది నమస్కారబాణమని గుర్తించినవారు తక్కువ. ఎవరు ఏమి అనుకున్నా తాను అనుకున్నది చెప్పగల ధైర్యం, చిత్తస్థైర్యం మొదటినుంచి ఆయన సొత్తు. ఆనాడు అంతగా వారిని ప్రశంసించిన ఆయన ఆతరువాత రెండు సంవత్సరాలకే వారిమీద మొదటిసారిగా తన అహింసా ఆయుధాన్ని ప్రయోగించాడు. 1917లో చంపారన్‌లో తోటల కార్మికులు అనుభవిస్తున్న అమానుషకష్టాలనువిని స్వయంగా పరిశీలించటానికి అక్కడకు వెళ్లాడు. ప్రభుత్వం ఆయనను అక్కడనుంచి వెళ్లిపొమ్మని ఉత్తర్వు చేసింది. చాలా మెత్తగానే ఆయన ఆ ఉత్తర్వును ఉల్లంఘించాడు. బ్రిటిషుప్రభుత్వ ఉత్తర్వును యీ దేశంలో ఉల్లంఘించిన మొట్టమొదటి సంఘటన అదే. భారతదేశంలో విదేశీపాలన అంతానికి ప్రారంభంకూడా అదే. ఈ ఉల్లంఘన దేశంలో పెద్ద సంచలనం కలిగించింది. ప్రభుత్వాధికారులను చకితులను చేసింది. ఏమి చేయాలో వారికి పాలుపోలేదు. ఆయనను జైలుకు పంపితే ఆయన ప్రాముఖ్యం మరింత పెరుగుతుందని అధికారుల భయం. ప్రభుత్వం బహిష్కరణ ఉత్తర్వును ఉపసంహరించుకొన్నది. ఆయన చేసిన కొన్ని సూచనలను కూడ అంగీకరించింది. అలాచేస్తే గొడవలేకుండా ఇదేదో స్వల్ప సంఘటనలా ముగిసిపోతుందని వారు భావించారు. కాని, అహింసాయుత సత్యాగ్రహానికి తొలి విజయంగా దీనిని భారతీయులు భావించుకొన్నారు. దేశప్రజలలో నూతన ఉత్సాహం చైతన్యం వీనివల్ల కలిగాయి.

### పట్టువిడుపులు

1918 లో కైరాలో కరువు పరిస్థితులు ఏర్పడినపుడు సత్యాగ్రహ పోరాటం రెండవసారి విజయం సాధించింది. పంటలు పోయినవి. కరువు ఏర్పడింది. ఆ యేడు శిస్తులు వసూలు చేయవద్దని మహాత్ముడు ప్రభుత్వాన్ని కోరాడు. ప్రభుత్వం పెడచెవిని పెట్టింది. రైతులను శిస్తులు కట్టవద్దని ఆయన కోరాడు. మళ్ళీ ప్రభుత్వానికి పరీక్ష ఎదురయింది. ప్రభుత్వం లొంగివచ్చింది. యీ విధంగా పట్టువిడుపుల పద్ధతితో ఒకరినొకరు ఓడించటానికి అటు ప్రభుత్వం, ఇటు మహాత్ముడు ప్రయత్నిస్తున్నారా అనిపించింది. శిస్తు రెమిషన్ ఇచ్చినందుకు కొందరు ప్రభుత్వపు మంచితనాన్ని ప్రశంసించారు. కాగా, సత్యాగ్రహ విధానానికి దీనిని ఘనవిజయంగా అందరూ అంగీకరించారు. బ్రిటిషువారి మంచితనం, వివేకాలపట్ల ఆయనకున్న నమ్మకంవల్ల వారు మంచిగానే యీ దేశాన్ని విడిచి వెళ్ళగలరని మహాత్ముడు మొదటినుంచి ఆశిస్తూ వచ్చాడు.

### సత్యాగ్రహోద్యమము

కాని 1919లో ప్రభుత్వం తీసుకొచ్చిన రౌలట్ చట్టం ఆయనకు ఆశాభంగం కలిగించింది. వారి ఉద్దేశాలను ఆయన శంకించాడు. ఆచట్టాన్ని చాలా జాగ్రత్తగా పరిశీలించాడు. ప్రజలందరూ దానికి వ్యతిరేకించాలని పిలుపు యిచ్చాడు. ఆ విధంగా 1921 నుంచి సత్యాగ్రహోద్యమం సాగుతూ వచ్చింది. ఈ ఉద్యమం ఎందరో ప్రజానాయకులను, రైతు నాయకులను, కార్మిక నాయకులను, స్వాతంత్ర్య యోధులను, యోధానయోధులను సృష్టించింది. ఈ ఉద్యమ సారథి ప్రధానయోధ గాంధీమహాత్ముడు.

శ్రీ జవాహర్‌లాల్ నెహ్రూ చెప్పినట్లు 'మహాత్ముడు ఒక్కసారి ప్రజల భుజస్కంధాలనుంచి భయం అనే యీ భారాన్ని చాల వరకు తొలగించారు. భయానికి అసత్యం తోడునీడవంటిది. అలానే అభయం, సత్యం ఒకదానినొకటి వెన్నంటి ఉంటాయి. భారతీయులలో అదివరకు లేని సత్య

ప్రియత్వం క్రొత్తగా వచ్చింది కాదు. ఒక్కసారిగా వారి ప్రకృతి మారిపోయిందని కాదు. కాని వారిలో మానసికంగా గొప్ప మార్పు వచ్చింది.

### కొత్త దృక్పథం

దేశంలో కోట్లాది ప్రజలమీద మహాత్ముని ప్రభావం ప్రసరించింది. కొందరు పూర్తిగా మారిపోయారు. కొందరు కొంతవరకు మారారు. అప్పటివరకు పైవర్గాలకు మాత్రమే పరిమితంగా వున్న స్వాతంత్ర్యోద్యమంలో ఆయన ప్రవేశపెట్టిన యీ కొత్త దృక్పథంవల్ల రైతుకూలీ ప్రజానీకం యావన్మందికీ యీ ఉద్యమం వ్యాపించింది. పరాయిప్రభుత్వం పునాదులు కదలిపోయాయి. దేశానికి స్వాతంత్ర్యం లభించింది. దేశ ఆర్థిక, సాంఘిక స్వరూపం గురించి ఆయనకు కొన్ని గట్టి అభిప్రాయాలు వుండేవి. అయితే, ఆయనవాటిని ఎప్పుడూ ఇతరులమీద బలవంతాన రుద్దటానికి ప్రయత్నించలేదు. ఆయనలో యీ భావాలు వృద్ధిపొందుతూ వచ్చాయి. మధ్యమధ్య కొన్నిటి విషయంలో కొన్ని మార్పులు చేశాడాయన. తన రచనలద్వారా యీ భావాలను ప్రచారం చేశాడు. స్వాతంత్ర్యోద్యమంలో ఆయననాయకత్వాన పనిచేసినవారంతా ఈ భావాలను సంపూర్ణంగా ఆమోదించలేదు. కొందరు యీ మౌలిక దృక్పథాన్నే వ్యతిరేకించారు. మరికొందరు వాటిని కొంతవరకు అంగీకరించారు. ఏ సంస్కరణకైనా ప్రజానీకానికి దానివల్ల ఏమి ప్రయోజనం వుంటుందన్నదే ముఖ్యపరీక్షగా వుండాలని, ఆయన ప్రబోధించిన యీ మౌలిక సిద్ధాంత ప్రభావం దేశంలో బాగా ప్రసరించింది. విశ్వకవి రవీంద్రనాథ్ టాగూర్ 1915 లో మొట్టమొదటిసారి, అందరికంటె ముందు ఆయనను 'మహాత్ముడు' అన్నారు. అప్పట్లో ఎవరూ అంతగా ఈ విషయం గుర్తించినట్లు లేదు తరువాత రౌలట్ చట్టానికి వ్యతిరేకంగా, దేశవ్యాప్తంగా జరిగిన నిరసన ప్రదర్శనలలో దేశం ఆయనను 'మహాత్ముడు'గా గుర్తించింది. గాంధి సిద్ధాంతాల ప్రభావం విశ్వజనీనమైంది. అది అన్నికాలాలలో, అన్ని దేశాలకు వర్తించగలది. గాంధేయ ప్రభావం ప్రజలమీద ముందు ముందు ఎంతకాలం ఏ రూపంలో వుంటుందో చెప్పజాలము. బుద్ధునివలె స్వదేశంలోకంటె విదేశాలలోనే ఆయన సిద్ధాంతాలు ఎక్కువగా వ్యాప్తిచెందవచ్చునని ఎవరో అన్నారు. మహాత్ముడు మరణించినప్పుడు ప్రపంచ దేశాలన్నిటినీ ముంచెత్తిన శోకవెల్లువనుబట్టి ఆయన అప్పటికే ప్రపంచ ప్రజలకు ఆత్మీయుడైనాడని స్పష్టమయింది. ఈనాడు ఆయన సిద్ధాంతాలు అనేక దేశాల ప్రజలకు శిరోధార్యాలైనాయి. ఆఫ్రికా దేశాలు కొన్ని ఆయన దారినే అనుసరిస్తున్నాయి. అమెరికాలో నీగ్రోలు సాంఘిక సమానహక్కుల కోసం సాగిస్తున్న పోరాటంమీద గాంధేయ అహింసావిధాన ప్రభావం స్పష్టంగా కనబడుతుంది. చెస్టర్ బోల్స్ ఇటీవల ఒక వ్యాసంలో చెప్పినట్లు "అమెరికన్ నీగ్రోలలో అత్యధిక సంఖ్యాకులు అహింసా విధానానికి కట్టుబడి ఉన్నారు. డాక్టర్ మార్టిన్ లూథర్ కింగ్ ప్రభృతి నాయకులు గాంధేయ విధానాన్ని తమదిగా చేసుకొన్నారు. మహాత్ముడు చూపిన అహింసా పద్ధతుల ద్వారా ఇప్పటికే అమెరికన్ నీగ్రోలు ఆర్థిక, సాంఘిక రంగాలలో అనేక అవరోధాలను తొలగించుకొనగలిగారు తమ యీ అహింసా కార్యక్రమాన్ని గాంధీ మహాత్ముని నుంచి అరువు తెచ్చుకొన్నట్లు డాక్టర్ కింగ్ ప్రభృతులు దాపరికం లేకుండా చెబుతారు గాంధీమహాత్ముడు యీ నూతన మార్గానుసరణలో రష్యన్ రచయిత టాల్‌స్టాయ్, అమెరికన్ తాత్వికుడు హెన్రీ తోరోవంటివారి ప్రభావానికి లోనైనాడు. కాగా హెన్రీ తోరోమీద భారతీయ ఉపనిషత్తుల ప్రభావం పనిచేసింది. 19[illegible]0 ల ప్రాంతంలో ఉపనిషత్తులను సంస్కృతంనుంచి ఆంగ్లభాషలోకి అనువదించారు తోరో హార్వర్డ్ [illegible]శాలాల గ్రంథాలయంలో వీటిని చదవటం జరిగింది. ఇవి ఆయనలో ఆలోచనలు రేకెత్తించాయి. ఆ తరువాత ఆయన వ్రాసిన "సివిల్ డిస్సొబీడియన్స్" అనే వ్యాసంలో వీటి ప్రభావం బాగా కనిపించింది. మహాత్ముడు ఈ తోరో రచననుంచి 'పౌర సత్యాగ్రహం' అనే మాటను గ్రహించి, మొదట దక్షిణాఫ్రికాలోను, ఆ తరువాత భారతదేశంలోను ప్రయోగించాడు. భారతదేశానికి బ్రిటిషు పాలన నుంచి విముక్తి సాధించిన అహింస, సహాయ నిరాకరణ పద్ధతులు యీనాడు అమెరికన్ నీగ్రోలకు హక్కుల ఉద్యమంలో ఉపయోగపడుతున్నాయి. ఈ పద్ధతులు ఒకప్పుడు అమెరికా నుంచి దక్షిణాఫ్రికా మీదుగా భారతదేశానికివచ్చాయి. మళ్ళీ ఇప్పుడు ఇక్కడనుంచి అమెరికా చేరాయి. వీటినిబట్టి అహింసావాద విశ్వజనీన దృక్పథం స్పష్టమవుతున్నది గాంధేయ సిద్ధాంతాల అంతర్జాతీయ ప్రభావం వెల్లడి అవుతున్నది. అందుకే గాంధి మహాత్ముడు ప్రపంచ స్వాతంత్ర్య యోధులలో అగ్రగణ్యుడు.

మరి అనతికాలంలో మహాత్ముని శతజయంతి ఉత్సవాలు జరుపుకోనున్నాము అప్పటికైనా యీ ప్రపంచంలో మరింతశాంతి, సంఘభావాలు పెంపొందితే అదే ఆయనకు మానవకోటి సమర్పించగల గొప్ప స్మృత్యంజలి.



బొబ్బిలిపాటి జాన్, బృందం: సమర్పణ, ప్రణాళికా పురోగతి (బుర్రకథ)
(విజయవాడ, ఏప్రిల్ 21)

# వివిధభారతి

## అఖిలభారత కదంబ కార్యక్రమము

ఏప్రిల్ 16-వ తేదీ మంగళవారం నుండి ఏప్రిల్ 30-వ తేదీ మంగళవారం వరకు

I వ ప్రసారము
ఉ॥ 7-00 నుండి 9-30

II వ ప్రసారము
10-15 నుండి 12-30 వరకు

III వ ప్రసారము
మ॥ 2-00 నుండి 3-45

IV వ ప్రసారము
సా॥ 4-00 నుండి 5-30

V ప్రసారము
సా॥ 6-30 నుండి రా॥ 10-40
శనివారములు V వ ప్రసారము
సా॥ 6-30 నుండి రా॥ 11-10 వరకు

ప్రసారము I
7.00—8.30
42.13 మీ 7120 కిలోసై)
7.00—9.30
41.82 మీ 7260 (కిలోసై)

7.00 వందనవార్ భక్తిగీతావళి

7.30 అర్చన

7.40 రుబాబ్ కార్యక్రమ విశేషాలు కావ్యమాధురి

7.45 ఉదయగాన్

8.00 మంజూషా
జానపద ప్రాంతీయ సంగీతం

8.15 హిందీలో వార్తలు

8.30 జయమాల
యుద్ధ సైనికులకు

9.30 ప్రసార సమాప్తి

ప్రసారము II
10.15—12.30
31.55 మీ (9510 కిలోసై)

10.15 రసవంతి పాటలు

10.30 రంగ్ తరంగ్

10.50 హిందీలో వార్తలు

10.55 సంగీతసేతు

11.00 జయమాల
యుద్ధ సైనికులకు

---

ఆదివారాలు ముఖ్యమైన పండుగ దినాలు

11.00 చిత్రధ్వని
సంక్షిప్త శబ్దచిత్రం (హిందీ)
(ప్రతి నెలా 1, 3, 5 ఆదివారములలో పండుగ రోజులలో)
రత్నాకర్
సంగీతం, కావ్య రచనలు, హాతకథలు
(ప్రతి నెలా 2, 4 ఆదివారాలు పండుగ దినాలు)

12.00 జయమాల

---

2.30 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము III
మ॥ 2.00 నుండి 3.45 వరకు
25.36 మీ 11880 కిలోసై)
30.77 మీ 9750 కిలోసై)

(ఆదివారాలు పండుగ దినాలు)

2.00 అప్నామర్
మీ యింట్లో అందరికి

(వారములో ఇతర రోజులలో)

2.00 ఫుల్వారి సంగీత కదంబం

(వారములో అన్నిరోజులలో)

2.30 జయమాల

3.30 చౌపరా
(జానపద ప్రాంతీయ సంగీతం)

### కర్ణాటక సంగీత కార్యక్రమము

3.45 అంజలి-గీతావళి

సా॥ ప్రసారము IV
4.00—5.30
25.27 మీ (11,870 కిలోసై)

4.00 గీతమాలిక

4.30 మధుర్ గీతం
మీరు కోరిన పాటలు
(ఆది, బుధ, శుక్రవారములు)

5.30 ప్రసార సమాప్తి

ప్రసారము V

6.30—9.30
31.33 మీ (9575 కిలోసై)
6.30—10.40—11.10
49.30 మీ (6085 కిలోసై)

6.00 జయ్ భారత్
జాతీయ సమైక్యతా గీతాలు

6.45 జయమాల
యుద్ధ సైనికులకు

7.45 వాద్యమాధురి
వాద్య కదంబం

8.00 కజరా

8.15 హిందీలో వార్తలు

8.30 రాగ్ రంగ్

8.45 సంగీత

9.00 చతురంగ్ పాటలు

9.15 హవామహల్
నాటికలు, రూపకములు
హాస్యరచనలు

9.30 సబ్ కా సాథీ
మీరు కోరిన పాటలు

10.30 నూపుర్

10.35 హిందీలో వార్తలు

10.40 ప్రసార సమాప్తి

### శనివారములు

10.30 గీతమంజరి లలిత సంగీతం

11.00 నూపుర్

11.05 హిందీలో వార్తలు

1.10 ప్రసారసమాప్తి

---

బెంగళూర్—బి
365.9 మీ (820 కిలోసై)
వివిధభారతి (రిలే)

| | | |
|---|---|---|
| ప్రసారము | I | ఉ॥ 7-00 నుండి 9-30 |
| ,, | II | ,, 10- 5 నుండి 12-30 |
| ,, | III | మ॥ -00 నుండి 5-30 |
| ,, | IV | సా॥ 6-30 నుండి 10-40 వరకు |

శనివారం మాత్రం IV ప్రసారం రా॥ 11-10 గంటల వరకు

---

ఇతర వివరములకు : ప్రొడ్యూసర్ 'వివిధభారతి' ఆకాశవాణి, పోస్ట్‌బాక్స్-4, బొంబాయి-1.

Printed at Arutperunjothi Press, Madras-1—Edited and Published by the Station Director, All India Radio, Madras-4



పి. ఆర్. అనంద లక్ష్మి: 'ఆహారము-పోషక పదార్థాలు' అను శీర్షికపై ప్రసంగం (ఇటీవల హైదరాబాద్ కేంద్రంనుండి ప్రసారితం)



కర్ణాటక సంగీతములో ప్రథమ బహుమతి నొందిన కుమారి ఎస్. సీత ఇటీవల హైదరాబాద్‌లో ఆకాశవాణి డెప్యూటీ డైరెక్టర్ జనరల్ శ్రీ ఎ. కె. సెన్‌వద్దనుండి బహుమతి నందుకొను దృశ్యం.





రేడియో నాటక సప్తాహ సందర్భమున ప్రసారమైన "మోతీమహల్" నాటికలో పాల్గొన్నవారు (ఇటీవల విజయవాడ కేంద్రంనుండి ప్రసారితం)

Regd. No. M. 5404

మద్రాస్‌లోని సెంట్రల్, ఎగ్మూర్ రైల్వే స్టేషన్లు—(రైల్వేవారోత్సవ సందర్భమున మద్రాస్, హైదరాబాద్ కేంద్రాలనుండి ఏప్రిల్ 12.18 తేదీలలో ప్రసంగములు, రూపకములను వినవచ్చును.)